

కొత్తగూడెంలో డిసెంబర్ 14వ తేదీన జరిగిన గీతా కంఠస్థ పోటీల బహుమతి ప్రదానోత్సవం. బహుమతులిస్తున్నవారు శ్రీ వనమాలి నర్సయ్య



జనవరి 16వ తేదీన ఖమ్మం జిల్లా మణుగూరులో భక్తి పాటల పోటీలు ముగ్గుల పోటీలు విశ్వ కల్యాణ దివస్ సందర్భంగా జరిగాయి. భారత మాత పూజలో పాల్గొన్నవారు శ్రీమతి పి. సీతారామమోహిని



సంస్కారభారతి వారి భారతమాత రథం కొత్తగూడెం వచ్చిన సందర్భంలో సంస్కారభారతి అధ్యక్షులు రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి ప్రసంగిస్తున్న దృశ్యం.



కొత్తగూడెంలో ముగ్గుల పోటీలో ప్రథమ బహుమతి పొందిన చిత్రం. ఇందులో విశ్వహిందూ పరిషత్ నినాదాలున్నాయి. చిత్రలిపిలో నిమగ్నమై ఉన్న వారు శ్రీమతి సి. హెచ్. సుగుణ



# విశ్వహిందు

ధార్మిక, సామాజిక మాసపత్రిక

సంపుటి 12 సంచిక . 2 ఈశ్వర - మాఘం 1998 -ఫిబ్రవరి

ప్రధాన సంపాదకులు
**ఆచార్య బి. రామరాజు**
సంపాదకులు
**పింగళి సుందరరావు**
సహసంపాదకులు
**హరినాధశర్మ**
సలహామండలి
**పి.వి.ఎస్. నాయుడు**
**డా॥ కసిరెడ్డి**

చందా వివరాలు
జీవిత సభ్యత్వం :
రూ : 500/-
వార్షిక చందా రూ. 50/-
విడిప్రతి : రూ. 5/-
డి.డి.లు **విశ్వహిందు** పేరిటనే పంపాలి.

చిరునామా :
**విశ్వహిందు**
4-5-212
విజయశ్రీ భవనం
కోఠి, భాగ్యనగర్ -500095
ఫోన్: 4617799, 591322

ఈ సంచికలో . . . .



## విశ్వహిందువాణి

హంగు పార్లమెంటు అది మరి రాకుండ
ఓటు విలువ నెరిగి ఓటరన్న!
ప్రజల బాగుగోరు పార్టీని గెలిపించు
విశ్వహిందు వాణి వినుడు వినుడు!

- సుందరం

**ధర్మమెక్కడ ఉంటుందో జయం అక్కడే ఉంటుంది**

## సంపాదకీయం

# ఉత్తిష్ఠత ! హిందూయువత !

పాకిస్థాన్ పుట్టినప్పటినుండి హిందువులు, హిందుత్వం, హిందూ దేశం, హిందూధర్మం, హిందూ సంస్కృతి లేకుండా చేయాలని పైశాచిక ప్రవృత్తిని ప్రదర్శిస్తున్నది. ఎత్తులతో నక్కజిత్తులతో ఈ దేశంలో తమ అనుయాయులెందరినో తయారుచేసుకుని వారి ద్వారా విధ్వంసక కార్యకలాపాలు కొనసాగిస్తున్నది. హిందూదేశం లేకుండా చేయడానికి ఈ అప్రత్యక్ష యుద్ధం నిరంతరం కొనసాగాలని, ఒక్కొక్క భూభాగమే దేశం వదిలిపోయేట్టు చేసే ప్రయత్నాలు ఆపకుండా నడుపుతున్నది.

98 జనవరి రెండో వారంలో పాకిస్థాన్‌లోని ఓ పత్రిక అప్రత్యక్ష అంతర్యుద్ధం నిరంతం కొనసాగేట్టు చేసి, హిందూదేశం బలహీనపడేట్టు చేయాలని, తదనంతరం సులభంగా ఆక్రమించవచ్చునని ప్రణాళిక వేసినట్లు ప్రకటించింది. పాకిస్థాన్ పన్నిన వ్యూహం ద్వారా సాధిస్తున్న విజయాల గురించికూడా ఆ పత్రిక వ్రాసింది.

అయితే హిందువులేం చేస్తున్నారు? అఖండ హిందూదేశంలో అంతర్భాగంగా ఉండి, మతంపేరిట దేశాన్ని చీల్చుకొని పోయిన పాకిస్థాన్ విషయంలో వారి విధంగానే ఆలోచిస్తున్నారా? ఉన్నది రక్షించుకోడానికి కనీస ప్రయత్నమైనా చేస్తున్నారా! దేశంలోకి విదేశీ చొరబాటు దారులు వస్తుంటే నిరోధిస్తున్నారా? ప్రభుత్వపరంగా ప్రజలపరంగా దేశరక్షణ విషయంలో జరుగుతున్న పనులేంటి!

సరిహద్దుల్లో ఉన్న సరిహద్దు రక్షణదళాన్ని, మిలిటరీని కూడా ప్రభుత్వం రక్షణ విషయంలో సరిగా ఉపయోగించుకోవడం లేదు. పైగా దేశద్రోహక ముస్లింలపై తీవ్ర చర్యలు తీసుకొంటే వారి ఓట్లు పడవేమో అన్నంత వరకు ఆలోచించి ముందడుగు వేస్తుంది. వాడేమో దేశాన్నే నాశనం చేయడానికి పూనుకొంటే ఈదేశంలో వివిధ పార్టీల ప్రభుత్వాలు కాంగ్రెసు, కమ్యునిస్టు, జనతాదళ్ పార్టీలు కుర్చీ కొరకు అంటుకు పోవడానికి దేశాన్ని బలిపెట్టడానికి కూడా వెనుకాడడం లేదు. ఇక బిజెపి, శివసేన పార్టీలు పాకిస్థాన్ కుటిలత్వాన్ని ఎదుర్కొనే విధంగా ప్రజల్ని సమాయత్తం చేస్తోంటే విదేశీ తొత్తులైన వామపక్ష

మేధావులు, కుర్చీలనంటుకుని బ్రతుక్కాలనే ప్రయత్నం చేస్తున్న అధికార పత్తు మనుషులు బిజెపి, శివసేనలను, సంఘ పరివార క్షేత్రాలను మతవాద పార్టీలుగా, సంస్థలుగా ముద్రవేస్తూ తమ చేతలకు రాతలకు గంగిరెద్దు తలలూపే పత్రికల ద్వారా విపరీత ప్రచారం చేస్తున్నారు. ఇంటిని తగులబెట్టి చుట్ట కాల్చుకునే ఈ బాపతు కుహనా మేధావులు, కుహనా సెక్యులర్ పార్టీలు ఈ ధాత్రి పుత్రులైన హిందువులకు ప్రమాదం తెచ్చిపెడుతున్నాయి. విదేశీ శక్తులను దువ్వుతూ నాకుతూ వాటి చుట్టు తిరుగుతున్నాయి.

తానెక్కిన కొమ్మను, తానే నరుక్కొనే పద్ధతి ఇది. నేతాజీ ఒక మహామంత్రంగా అందించిన జైహింద్ సినాదం వెనుక ఉన్న తత్వ మేంటో ఈ విదేశీ భావబానిస బుద్ధులు అర్థం చేసుకోవలసి ఉంది. హిందుత్వానికి, హిందువులను, హిందూదేశానికి, హిందూధర్మానికి హిందూ సంస్కృతికి విజయం కలగాలని కోరడమే అందులో ఉన్న అర్థం. జై రష్యా, జైజై చైనా అనే కమ్యూనిస్టులు తప్ప జైహింద్ పదాన్ని మిగతా అందరు పలుకుతారు. అయితే ఈ మధ్యే హిందువులను విదేశీ క్రైస్తవులుగా మారుస్తూ, కరపత్రాలు పంచుతూ ఊరూరు తిరుగుతున్న క్రైస్తవ ఫాదరీలు జైహింద్ నినాదాన్ని తత్వాన్ని వ్యతిరేకిస్తూ ప్రసంగిస్తున్నారు. హిందువుల గుళ్ళ దగ్గర తీర్థక్షేత్రాల దగ్గర కూడా ఈ విదేశీ క్రైస్తవ మతోన్మాదులు కరపత్రాలు, పుస్తికలు పంచుతున్నారు.

హిందువుల్లోని కులాలనూ, సంప్రదాయాలను, కించ పరిచే ప్రయత్నాలు మొదటి నుండి ఈ విదేశీ శక్తులే చేస్తున్నాయి. ఇక సెక్యులర్ ముసుగు కప్పుకొన్న పార్టీలన్నీ హిందుత్వాన్నే దూషిస్తున్నాయి. యువ హిందూశక్తిని నిర్వీర్యం చేస్తున్నాయి. విదేశీ ముస్లిం సంస్థలకు వత్తాసు పలుకుతూ, అందులో పనిచేసే వారిని ప్రోత్సహించి హిందువుల పై దాడులు చేయిస్తున్నాయి. హిందుత్వ వికాసంలో కళారంగం ద్వారా కృషి చేస్తున్న గుల్షన్ కుమార్ లాంటి వాళ్ళు హత్య చేయబడితే, సంతోషించి సంబరాలు జరుపుకొంటున్నాయి.

ప్రపంచంలో ఏదేశంలో లేని విపరీత పరిస్థితి ఇది. విదేశీ ఓటర్లతో అధికారాన్ని సంపాదించుకోవాలనేకునే వీరు తమ 'స్వదేశీకి' నిప్పుపెట్టడం తమ అస్తిత్వాన్ని నాశనం చేసుకోవడమే అవుతుంది. హిందూ యువత ఈ దేశద్రోహాన్ని గుర్తిస్తున్నది. హిందుత్వం అస్తిత్వమే దేశ అస్తిత్వంగా, హిందూ జనత అస్తిత్వంగా భావించే జనత దినదినం పెరుగుతున్నది. హిందుత్వాన్ని రక్షించే వారినే అధికారంలోకి తేవాలని అభిలాషిస్తున్నది. ఇది శుభపరిణామం. *

**విశ్వహిందు - ఫిబ్రవరి, 1998**

## పద్యం - ధర్మప్రబోధం

# దేవనిష్ఠ - దేశనిష్ఠ

-శాంతిశ్రీ

దేవుడన మాతృదేశము
దేవతలన ప్రజలు; యజ్ఞ దీక్షయనంగా
సేవావ్రత నిష్ఠయ; యివి
జీవన సూత్రములుగా ప్రసిద్ధింగనుమా ! (తుమ్మల పద్యాలు)

- మాతృదేశమే దేవుడు. ప్రజలే దేవతలు; సేవా వ్రత నిష్ఠేయజ్ఞదీక్ష. ఇవే జీవన సూత్రాలుగా గ్రహించి ప్రసిద్ధి పొందండి !

మహాత్ముని ఆస్థాన కవిగా బిరుదుపొందిన రాష్ట్రకవి శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి పద్యమిది. బ్రిటిషువారిని పంపించి, దేశమాతకు ముక్తి కలిగించి, ప్రజలకు స్వాతంత్ర్యం సంపాదించి పెట్టాలని ఎందరో త్యాగాలు చేస్తూ జాతీయోద్యమాన్ని పటిష్ఠంగా నిర్వహిస్తోన్న రోజులవి. అప్పుడు దేవుడు, దేవతలు, యజ్ఞం అనే పదాలకు వినూత్నార్థాలను చెప్పాల్సిన అవసరం ఉందనిపించింది. అందుకే పై పద్యం ప్రాదుర్భవించింది. ఈ దేశం, ఈప్రజలు. ఈ కర్మయోగ జీవనం ఉన్నంత వరకు ఈ పద్యం శాశ్వత సందేశాన్ని అందిస్తూనే ఉంటుంది.

దైవం విశ్వమంతటా ఉన్నాడు. గాలి, నీరూ, వెలుగూ అందించే దివ్యశక్తులు (దేవతలు) శాశ్వతంగా ఉన్నాయి. పదిమందికి ఉపకరించే పని ఏదైనా యజ్ఞమే అవుతుంది. ఇవి ఆ పదాలకు పూర్వార్థాలు. ఈ దృష్టిని దేశం వైపు మరల్చవలసి ఉంది.

అందుకొరకే నీ మాతృదేశమే నీకిప్పుడు దైవం అంటున్నారు తుమ్మల. దైవం ఎంత శాశ్వతమైందో, దేశమూ అంత శాశ్వతమైందే. దైవం ఈప్రాణికోటిని ఎలా నిలుపుతుందో నీ మాతృదేశం నిన్నలా నిలుపుతుంది. నీ దేశాన్ని ఆసురీశక్తులు ఆక్రమించి ఉన్నాయి. నీలో దైవీ శక్తిని నింపుకుని నీదేశాన్ని రక్షించుకో !

అదేవిధంగా దేవతలనే వారెక్కడో లేరు ! గుర్తుంచుకో ! ప్రజలే నీకు దేవతలు. నీ సంక్షేమాన్ని నీవెలా కోరుకుంటావో, నీలాంటి వారే అయిన వారి సంక్షేమాన్ని అదేవిధంగా కోరుకో ! వారికి సేవ చేయడమే యజ్ఞ దీక్షగా భావించు.

విశ్వం అనే మాట దేవునికున్నది. జీవాత్మే దేవుడని ఉన్నది; యజ్ఞమే దైవమని విష్ణు సహస్ర నామాలు తెలుపుతున్నాయి. ఆ అర్థాలనే దేశం పరంగా ప్రజలపరంగా సేవాపరంగా చెప్పారు కవి తుమ్మల. వెరసి అంతా కలిపి దేవనిష్ఠను - దేశనిష్ఠగా మార్చుకుని నడవవలసిందని అర్థం. నాడు-నేడు-రేపూ ఎప్పుడైనా గ్రహించాల్సిన పరమార్థం. *

**చిన్న కథ - పెద్ద సందేశం**

# రాముడుండే దేహంలో కాముడుంటాడా?

- డా. కసిరెడ్డి

పరదారాపహరణం, పరధనాపహరణమే తన ధర్మంగా ప్రగల్భించే రావణాసురుడు సీత నెత్తుకుని వచ్చి అశోకవనంలో పెట్టాడు. సీతను వశం చేసుకోవడానికి నిరంతరం వేధిస్తూనే ఉన్నాడు. నయానాభయానా చెప్పి చూశాడు కాని లబించలేదు. సీత తన దారికి రావడం లేదు. పైగా తనకే నీతులు చెబుతున్నది.

“ఓ రావణా! నీవు హాయిగా ఉండాలనుకొనేట్లయితే అందరి చావు వద్దు అనుకొనేట్లయితే నీవు ఆ పురుషోత్తమునితో స్నేహం చేసుకో. ఆయన ధర్మజ్ఞుడు. శరణాగతవత్సలుడు, నీవు జీవించాలనుకొంటే ఆప్రభువుతో చెలిమి చేసుకో నీవు ఆశరణాగత వత్సలుణ్ణి సంతోష పెట్టు. నీవు పరిశుద్ధుడవై నన్ను నా నాధునికి సమర్పించు. ఇలా నన్ను ఆయనకు సమర్పించేటట్లయితే నీకు మేలు కలుగుతుంది.”

సీత ఇలా పలికిన తర్వాత రావణునిలో అశాంతి చెలరేగింది. కల్లోలిత మనస్కుడై అంతఃపురంలో అటూ ఇటూ తిరుగుతున్నాడు భర్త ఈ అశాంతి మండోదరికి కొత్తేమీ కాదు. అయినా ఆమె అడిగింది.

‘రాముడు తప్ప ఈ ప్రపంచంలో మరెవ్వరు తనకు భర్త కారు’ అని సీత అన్నట్టుగా రావణుడు మండోదరితో చెప్పాడు.

‘మీకెన్నో మాయలూ మంత్రాలు వస్తాయి కదా! వాటితో రామునిగా వేషం మార్చుకుని సీత దగ్గరికి వెళ్ళాల్సింది’’ అన్నది మండోదరి.

‘ఆపని ఇదివరకే చేశాను’ అన్నాడు రావణుడు.

‘అయితే ఏమయింది? సీత నీ నిజరూపాన్ని పసిగట్టిందా? అడిగింది మండోదరి.

‘కాదుకాదూ! నేను రామునిగా మారి సీత ముందు నటించాలనుకున్నాను. రామునిగా మారాను. కాని సీత ముందుకే వెళ్ళ లేకపోయాను. ఎందుకంటే రాముడుండే దేహంలో కాముడుండడం లేదు’... దీనంగా అమాయకునిలా చెప్పాడు రావణాసురుడు.

ఆ మాటలకు మండోదరి ఆ శ్రీరామచంద్రునికి మనస్సులోనే కోటి నమస్కారాలు సమర్పించుకొన్నది. సీతామాతను స్మరించుకొన్నది. తన భర్త రావణుని అమాయకత్వానికి నవ్వుకొన్నది. రాముడు పుణ్య గుణాభిరాముడన్నది. త్రిజగత్ రక్షైక దీక్షా గురుడన్నది. భర్త వినకపోతే, వినాశకాలంలో విపరీత బుద్ధులే వస్తాయన్నది. రూపం మారడంతోనే రాముని గుణాలు రావడం అనేది పరమాద్భుతమనిపించింది.

## రామో విగ్రహవాన్ ధర్మః

**విశ్వహిందు - ఫిబ్రవరి, 1998**

**ధర్మ సందేహాలు**

# ముగ్గురమ్మలు - ముగ్గురయ్యలు

*(మీరు ప్రశ్నలు పంపించండి ! పెద్దలనడిగి సమాచారం సేకరించి ప్రచురిస్తాం)*

ప్రశ్న : బ్రహ్మకునోట, శివునికి సగం శరీరంలో, విష్ణువునకు ఎదపై వాణీ, గిరిజా, కమలలు ఉన్నారని పురాణాలు చెబుతున్నాయి గదా! ఇట్లా ఎలా ఉంటారు. ఇలా ఉండడంలోని అంతరార్థమేమిటి?

శ్రీ గాజుల రవీంద్ర,
ఉస్మానియా క్యాంపస్, భాగ్యనగర్

సమాధానం : మనధర్మం స్త్రీపురుషులకు సమానత్వాన్నే ప్రతిపాదించింది. ఇందులో ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనే ప్రశ్నే లేదు. ఆత్మకు స్త్రీ పురుష భేదం లేదు. అది ఏ జీవిలో ఉన్నా ఒక్కటే. పరమాత్మకూ పరమేశ్వరికి తేడా లేదు. ఇరువురు ఒక్కరే. కాని మానవుడు స్త్రీ పురుషులుగా ఈ లోకాన్ని చూస్తూ దైవాన్ని కూడా అదే దృష్టితో దర్శనం చేశాడు.

ఆదర్శనం వల్లనే అమ్మవారు లేకుండా అయ్యవారెట్లా అనే ఆలోచన కలిగింది. ఒకే దైవాన్ని సృష్టికర్తగా, స్థితికారునిగా, లయకారునిగా, పిలుచుకోవడం జరిగింది. ఇదే త్రిమూర్త్యాత్మకమైన సిద్ధాంతం.

బ్రహ్మ సృష్టిస్తాడు ; సృష్టికి జ్ఞానం కావాలి ; జ్ఞానం సరస్వతి ఇస్తుంది. సరస్వతి జ్ఞానం ఇవ్వలేదనుకోండి. బ్రహ్మ సృష్టిలో లోపం ఏర్పడుతుంది. భగవంతుని సృష్టిలో లోపమెక్కడా ఉండదు. మనకు లోపం లేకుండా ఈ సృష్టి కనిపించడానికి కారణం జ్ఞానదేవత అయిన సరస్వతే. ఆమె జ్ఞానమే బ్రహ్మను సృష్టి కర్తగా నిలిపింది.

విష్ణువు స్థితి చేస్తాడు, అంటే నిలుపుతాడు? నిన్ను నన్ను అందరిని నిలుపుతాడు. చెట్టూ, రాయీ, రప్పా, గుట్టా పుట్టానదీ నదాలు ఆకాశం నక్షత్రాలు ఇవ్వన్నీ గట్టిగా నిలబడి ఉండడానికి విష్ణువే కారణం. మన పుష్టికి మూలమైన అన్నం ధనం అన్నీ విష్ణువే ఇచ్చాడు. విష్ణువుకు లక్ష్మీ అమ్మవారిచ్చారు. ఆమె ఐశ్వర్యానికి గుర్తు. ఆమె లేదనుకోండి! సంపదే లేదు! విష్ణువు నిలపడమే లేదు. అందువల్ల లక్ష్మీ దేవి సంపదలిస్తున్నదని గ్రహించండి. ఆ సంపదల వల్లనే విష్ణువు స్థితికారునిగా నిలిచి ఉన్నాడు.

రుద్రుడు లయం చేస్తాడు. అన్యాయాన్ని అక్రమాన్ని అవినీతిని, అధర్మాన్నిలయం (నాశనం) చేయాలంటే బలం కావాలి. బలమంటే శక్తి. శక్తికి గుర్తు పార్వతి. పార్వతి ఆదిశక్తే. ఆమె నిరంతరం ఆయనలో సగంగా ఉండి శక్తినిస్తూనే ఉన్నది. అందువల్ల రుద్రుడు చెడుసు నాశనం చేయగలుగుతున్నాడు.

ఇప్పుడు చెప్పండి! హిందూతత్త్వంలో స్త్రీకి ఇచ్చిన స్థానం ఎంత అపూర్వమయిందో! ఒకరివ్వడం కాదు ఆ తల్లే ఇది తన ధర్మంగా గ్రహించి సృష్టి నడిపిస్తున్నది.

*( డా॥ కసిరెడ్డి గారి సుదీర్ఘ సమాధానం ఆధారంగా)*



**ఓటరు నారాయణా లేచిరా!**

## స్వతంత్ర స్వర్ణోత్సవ 'భారతి' పిలుస్తోంది ....రా... కదలిరా

- శ్రీకుమార్తి

మన జాతిని రెండు వందల ఏళ్ళకు పైగా పట్టిపీడించిన విదేశీ పాలన నుండి స్వేచ్ఛా వాయువులు పీల్చడం మొదలై 50ఏళ్ళు నిండిన సందర్భంగా, మన కర్తవ్యాన్ని గుర్తు చేసుకుని మెలకువతో ముందడుగు వేయాల్సిన సమయం ఇది. లంచగొండితనం, భద్రతా రాహిత్యం, స్వార్థశక్తులు, ఉగ్రవాదుల, పీడ నుండి మనకు విముక్తి కలిగించి జాతికి మార్గదర్శనం చేయగల ప్రభుత్వాన్ని ఢిల్లీ సింహాసనంపై ప్రతిష్ఠించుకునే గోల్డన్ ఛాన్స్ ఈ స్వతంత్ర స్వర్ణోత్సవ సమయంలో మనకు కలిగింది.

సోదర సోదరీ మణులారా! భరతమాత కన్న బిడ్డలారా!!

వేలాది మంది త్యాగమూర్తుల తపః ఫలమైన ఈ స్వాతంత్ర్యం గత ఏబై ఏళ్ళుగా ఈనగాచి నక్కల పాలైనట్లు నగుబాటుకు గురైంది. జాతి దగా పడింది..

గురుగోవింద్ సింగ్, ఝాన్సీ లక్ష్మిబాయి, అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్, రాజగురులు, నెత్తురు చిందించి, విదేశీ పాలకులను, ఇక్కడనుంచి తరిమి కొట్టారన్న సత్యాన్ని మన పాలకమ్మన్యులు మరచి, భోగలాలసతో, అధికార కాంక్షతో భారతమాతను ప్రపంచ మార్కెట్‌లో తాకట్టు పెట్టారు.

మనం నమ్మి అందలమెక్కించిన నేతలు 1962లో చైనాకు దాసోహమని దేశభూమిని ఆక్రమిస్తే మిన్నకున్నారు. భూభాగాలను పాకిస్థాన్ ఆక్రమిస్తే మిన్నకున్నారు.

అయిదు దశాబ్దాలుగా మనదేశాన్ని పాలించిన పాలకులు మనకు అందించిన బహుమానాలు ఏమిటంటే జీవితభీమా (ఎల్.ఐ.సి) సొమ్మును, పంఢాస్ ముంద్రాకు (వ్యాపారవేత్త) ఉచితంగా ముట్టచెప్పడం, స్టేట్ బ్యాంకు నుండి లక్షలు మాయం చేసిన నగర్వాల కుంభకోణం, దేశరక్షణ వ్యవస్థనే అతలాకుతలం చేసి బలహీన పరచిన బోఫోర్స్ శతఘ్నులు, జర్మన్ జలాంతర్గాములు వ్యవహారంలో వందలకోట్లు మింగటం.

సుఖాలను, సంపదలను, త్యాగంచేసి రణరంగాన దూకిన నేతాజీ సుభాష్ చంద్రబోస్ స్ఫూర్తిని మనమంతా గుర్తుకు తెచ్చుకుంటే, ప్రస్తుతం మనదేశాన్ని ఏలుతున్న దగా కోరులవైఫల్యం మనకు అర్థమవుతుంది.

ఎండనక, వాననక శ్రమించి పుడమితల్లి ఒడినే నమ్ముకున్న కష్టజీవి రైతుబిడ్డ పండించే పంటకు గిట్టుబాటు ధరలుండవు. కానీ మనకు అవసరమైన ఉల్లి ధర

కిలో 20 రూపాయలు. చింతపండు 50రూపాయలు.

ఇటు ప్రజలను, అటు పండించే రైతులను ఏకకాలంలో పీడించి మోసంచేసే ప్రభుత్వాలు ఆగ్రహించనున్న రైతులందరికి కారు చవకగా విషమందించి ఆత్మ హత్యలను ప్రేరేపిస్తున్నాయి.

ఐ.యం.ఎఫ్. అప్పులు, వరల్డ్‌బ్యాంక్ నుండి వడ్డీ లేని ఋణాలు, అమెరికా డాలర్లు వగైరా వగైరా అంతర్జాతీయ అప్పులను తెచ్చే మన ప్రభుత్వాలు చావుకు సిద్ధమైన రైతుకు 'పైసా'రుణం ఇవ్వమంటే ఇష్టపడవు.

దేశ రక్షణలో కీలక పాత్ర వహించే భారతవైమానిక దళంలో అసంతృప్తి రాజుకుని సమ్మెలు జరుగుతుంటే మన రక్షణ మంత్రి ముంబాయికి వెళ్ళి బాంబులు పేల్చిన మాఫియా గాంగ్‌ల నేతలతో ఎన్నికల ఒప్పందాలు ఏర్పాటు చేసుకునే హడావుడిలో ఉన్నారు. వైమానిక దళం వారితో ఒక్క సమావేశానికి కూడ ఆయనకు తీరిక లేదు. సరిహద్దుల వద్ద 'రక్షణ' గురించి ఆయనకు పట్టదు.

బొంబాయి కోయంబత్తూరు, పంజాబ్, అస్సాం, నాగాలాండ్, ఉత్తర తెలంగాణా, తదితర ప్రాంతాలలో ఉగ్రవాదం పెచ్చరిల్లి, వేలాదిమందిని మట్టుపెట్టుకుంటున్న తీవ్ర వాద ముఠాలకు ఐఎస్ఐ మార్గదర్శనం లభిస్తున్నదని అందరికీ తెలిసిందే. అయినా దాని గురించి గృహ మంత్రికి పట్టదు. తన హోంశాఖ కార్యదర్శితో ఆలోచించడు. గతంలో శ్రీ చవాన్ శ్రీ పైలైట్‌లు పరస్పర కలహంతో కాశ్మీర్‌ల మంటలు పెట్టారు.

ప్రతి బ్యాంకు నుండి వేలాది కోట్లను హర్షద్‌మెహతా వంటి వీరులు కాజేస్తుంటే సూట్‌కేసుల సొమ్ముతో సరిపెట్టుకునే ప్రధాన మంత్రుల పాలనలో బ్యాంకులు దివాల తీయటంతో ఆయన మంత్రి వర్గ సహచరుడు ఇపుడు ఆర్థిక మంత్రిగా గద్దెనెక్కి లండన్ వెళ్ళి "ఆంగ్లేయులారా మీరు దేవతా స్వరూపులని గమనింపక మిమ్మలను వెళ్ళేటట్టు చేశాం. మీరు తిరిగి మా దేశానికి విచ్చేసి ఈస్టిండియా కంపెని వలె పాలించండి అని ప్రాధేయపడ్డాడు.

స్వరాజ్యమే నా జన్మహక్కని నినదించిన లోకమాన్య తిలక్‌ను స్మరించవలసిన ఈ స్వర్ణోత్సవ సమయంలో మెకాలే మానస పుత్రులను, నల్లతోలు కలిగి ఉన్న తెల్లవారైన ఈ దగా కోరులను ప్రభుత్వం లోనికి రాకుండా అడ్డుకుందాం.

మద్యపాన నిషేధం పేరిట పన్నులు వడ్డించి తమ నేతల ద్వారా దొంగసారా వ్యాపారం చేయించి, రెండు చేతులా సంపాదించి వాళ్ళ వైన్ షాపులను మనకు అందించిన ప్రభుత్వాల గురించి చెప్పవలసిన సమయం ఇది.

మనదేశాన్ని హోల్‌సేల్‌గా దివాలా తీయించి, పరిశ్రమలను మూయించి, కష్టజీవుల కడుపుకొట్టి, ప్రపంచ మార్కెట్లో మన భారత మాతను అమ్మకానికి పెట్టి లిబరలైజేషన్

పేరులో సరళీకృత మృత్యుశాసనాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ...కన్నీళ్ళతో హైటెక్ పద్ధతిలో వ్రాస్తున్నాయి

అవినీతికి తావివ్వకుండా, గ్రామప్రజలను పీడించకుండా, దేశంలోని పరిశ్రమలకు రక్షణ కల్పిస్తూ జాతి సమగ్రత, దేశరక్షణ విషయాలపై రాజీలేని దోరణితో నిక్కచ్చిగా జాతికి మార్గదర్శనం చేయగలిగే దేశభక్తుల ప్రభుత్వాన్ని స్థాపించవలసిన బాధ్యత మీది, మనది.

ఆర్థిక వ్యవస్థనే కాదు, మన ఇంటిలోని టెలివిజన్ ద్వారా మన ఆలోచనా ధోరణిని, మన సంస్కృతిని, మన సామాజిక విలువలను విషప్పురుగు వలె కబళించేందుకు విదేశీ శక్తులు కదలి వస్తున్నాయి. అత్యున్నత పదవులు నిర్వహించే వారి కుటుంబాల లోకి విదేశీ వస్తువులు ప్రవేశపెట్టడం వీలైతే కొన్నేళ్ళ తరువాత వారినే నేతలుగా ప్రతిష్ఠించడం వంటి కుట్రలను అంతర్జాతీయ మాఫియాలు పాల్పడుతున్న వేళ మనమంతా అప్రమత్తంగా ఉద్వేగాలకు, సెంటిమెంట్లకు తావివ్వకుండా జాతీయ భావాలు కలిగిన ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించుకుందాం.

స్వేచ్ఛా సమానతలకై స్వాతంత్ర్య పోరాటం సాగించిన వారి పేరు చెప్పుకుని పదవులు పొందినవారు ఎమర్జెన్సీని పెట్టి దేశంలో కాళరాత్రిని రప్పించారు.

భింద్రన్‌వాలే వంటి ఉగ్రవాదులను పెంచి పోషించి ఆ తర్వాత ఢిల్లీలో వేలాది సిక్కులను ఊచకోత కోయించి ఆ రక్తపు టేర్లతో పంజాబ్‌ను అతలాకుతలం చేసిన మన పాలకులు, గత అయిదేళ్ళుగా పెట్రోలు పంపులు, అద్దె కొంపలను, ఎలా అమ్ముకున్నదీ సాక్షాత్తు సుప్రీంకోర్టు ఎలా తప్పు పట్టిందీ మనం మరువజాలము. దారిద్ర్యం, అవినీతులకు పట్టం గట్టిన ప్రభుత్వాలన్నింటికి సమాధి కట్టే శక్తి లేకపోతే మళ్లీ మనం పారతంత్ర్యం లోకి వెళ్ళిపోవడం ఖాయం. అందుకే ఈ సందర్భంగా ప్రతి వ్యక్తి తనదేశాన్ని గూర్చి, జాతి హితాన్ని గూర్చి ఆలోచించ వలసి ఉంది. జాతీయ శక్తులను బలపరచవలసి ఉంది. ఆ స్వతంత్ర స్వర్గసీమ నిర్మింపగ తరలి రా అని అందరికీ పిలుపు నివ్వవలసి ఉంది.

భావి తరాలన్నీ బాగుపడాలన్న తపనతో, సంపదను, సుఖాలను త్యాగం చేసి స్వతంత్ర సంగ్రామంలో ఉరికొయ్యలను చిరునవ్వుతో ముద్దాడిన భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను స్మరించుకుంటూ ఆ అమర వీరుల త్యాగం వృథా కాదన్న ప్రతిజ్ఞపూని ముందడుగు వేద్దాం. ఈ ఎన్నికలలో దేశభవిష్యత్తును నిర్మిద్దాం.

21వ శతాబ్దంలోకి మనలను నడిపించే సమర్థ పాలనను అందించే సుస్థిరప్రభుత్వం కోసం ఓటు వేద్దాం, భరతమాత ఋణం తీర్చుకుందాం.

**స్వరాజ్యం నా జన్మహక్కు - నిన్నటి మాట**
**సురాజ్యం నా ధ్యేయవాక్కు - నేటి మాట**

**క్ష్వేహిందు - ఫిబ్రవరి, 1998**

మన పండుగలు

# శివరాత్రి ఇలా జరుపుకొందాం- శివతత్త్వం తెలుసుకొందాం

- శ్రీమతి పి. సరళ

"బ్రహ్మ మురారి సురార్చిత లింగం
నిర్మల భాసిత శోభిత లింగం
జన్మజ దుఃఖ వినాశక లింగం
తత్ప్రణమామి సదా శివలింగం". అంటూ
"చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర పాహిమాం!
చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర రక్షమాం !! అంటూ
" గంగా తరంగ రమణీయ జటాకలాపం
గౌరీ నిరంతరం విభూషిత వామ భాగం
నారాయణ ప్రియ మనంగ మదాపహారం
వారాణసీ పురపతిం భజవిశ్వనాథం॥" అంటూ

భక్తి ప్రపత్తులతో శివశంకరుడైన ఆ పరమేశ్వరుని కీర్తిస్తాం! భజిస్తాం! కొలుస్తాం! శివుడు మంగళకరుడు. అనగా లోకాలకు శుభములను గూర్చువాడు కనుకనే క్షీర సాగర మథనంలో ఉద్భవించిన హాలాహలాన్ని తన కంఠంలో దాచి లోకాలను రక్షించాడు. అతని తనువులో సగము తానై యున్న మంగళకారిణి పార్వతి కూడా హాలాహల భక్షణకై శివుని ప్రోత్సహించింది.

"మ్రింగెడి వాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళ సూత్రంబు నెంత మది నమ్మినదో!॥

అమ్మవారు సర్వమంగళ, అయ్యవారు మంగళకరుడు. భక్తలోకానికింక కావలసిందేమి? సత్య, శివ, సుందర రూపుడైన పరమాత్మను కొలిచి, భజించి, తరించిన భక్తులెందరో మనకు చరిత్రలో కనిపిస్తారు. యథాశక్తి స్వామిని అర్చించి శివ సాయుజ్యం పొందిన శ్రీ, కాళ, హస్తుల కథ తెలిసిందే. సాటిలేని భక్తితో, తన కన్నుతనే అర్పించి ముక్కంటి కృపకు పాత్రుడైన కన్నప్ప కథ లోక విదితమే. తనకు తెలియకుండానే ఒక వేటగాడు శివరాత్రి నాటి రాత్రి క్రూర జంతువులు తన మీద పడకుండా రక్షించుకొనుటకై బిల్వ వృక్షము నెక్కి రాత్రంతా మేలుకొని ఉన్నాడు. తన తాకిడి వల్ల ఆ ఆకులు రాలి క్రింద నున్న శివలింగంపై పడినాయి. ఆ రోజంతా అతడు ఏ ఆహారము దొరకక ఉపవాసమే ఉన్నాడు. అందుకు ఆపరమ శివుడు సంతోషించి బోయవాని పాపాలు పటాపంచలు చేశాడు. అందుకే అతడు బోళాశంకరుడు, శివంకరుడు.

శివపురాణంలోనూ, శ్రీనాథ కవి రచించిన శివరాత్రి మాహాత్మ్యంలోనూ శివుని

భక్త వత్సలత ఎలాంటిదో తెలుస్తుంది. పరమ నీచుడూ, దుర్మార్గుడూ అయిన గుణనిధి తినటానికి తిండి లేక ఉపవాసముండి ఆకలితో బాధపడుతూ చివరికి ఆరోజు శివరాత్రి శివాలయంలో భక్తులందరూ శివునర్చించి నైవేద్యంగా ఉంచిన ప్రసాదమును దొంగిలించి తినదలిచాడు. అందరూ నిద్రిస్తుండగా, గర్భగుడిలోకి ప్రవేశించాడు. కొండెక్కుతున్న దీపాన్ని తన పంచె కొంకు చింపి వత్తిగా చేసి వెలిగించాడు ఎదుటకు వెళ్ళబోతుండగా కాలికేదో తగిలి క్రింద పడి మరణించాడు. శివసాయుజ్యాన్ని పొందాడు. అందుకే శంకరుడు భక్తవశంకరుడు.

శివునికి ఇష్టమైన రాత్రి శివంకరమైన రాత్రి. లోకానికి శుభంకరమైన రాత్రి. ఇదే శివరాత్రి.

1. అందుకే ఈ శివరాత్రి నాడు పవిత్రమైన భావనలతో, నిర్మలంగా, నిశ్చలంగా, పరమేశ్వరుని భజించాలి, తరించాలి.
2. గృహాలను, శుభ్రంచేసి, మామిడాకుల తోరణాలు కట్టి, వాకిళ్ళలో కళ్ళాపియ చల్లి ముగ్గులు పెట్టాలి.
3. శుచియై, పవిత్రంగా భగవధ్యానం చేయాలి.
4 ఇరుగు పొరుగులతో కలసి భగవత్కథాకాలక్షేపాలు చేయాలి
5 అజ్ఞాన మనే అంధకారంలో నిద్రిస్తున్న మనం జాగరూకులమై "శివరాత్రిని" చేసుకోవాలి
6. శివాలయములకు వెళ్ళి స్వామిని అభిషేకించడమే కాకుండా సమాజ పరమేశ్వరునికి ప్రేమాభిషేకం చేయాలి.
7. శివరాత్రి జాగరణం, పేరుతో, టివిలముందు కూచుని మనసులో ఆందోళనను రేకెత్తించే, హింస, దౌర్జన్యం, అశ్లీలం, అసభ్యకరమైన సినిమాలు చూడకుండా, కనీసం ఈరోజైనా మనసుకు ప్రశాంతత నందించేవి, సనాతనధర్మపరిరక్షణంగావించే పురాణ శ్రవణమో, సత్కథాకాల క్షేపమో చేయాలి
8. సాటి మనిషిలో శివుణ్ణి దర్శించే సద్గుణాలు, అలవరచుకొనే ప్రయత్నం చేయాలి.
9. భారతమాత రక్షణలో ప్రతి వ్యక్తికి ప్రతిరాత్రి శివరాత్రే కావాలి. జాతిలో శక్తి జాగరణం కావాలి. గుణనిధి, సద్గుణనిధి కావాలి.
10. ఉపవాసం ఉండి తెల్లవారు పేకాలటాడి జాగరణం చేయడం వల్ల శివరాత్రి ఫలితం లభించిందనుకుంటే అది పొరపాటే అవుతుంది.
11. లోకమంతా సత్యం, శివం, సుందరమై భాసించే విధంగా వ్యష్టినుండి పరమేష్టి వైపుగా మనిషి ఎదిగేతత్త్వాన్ని శివరాత్రి ద్వారా అధ్యయనం చేయాలి.

శివరాత్రి మాఘకృష్ణ చతుర్దశి నాడే జరుపుకొంటాం. ఇది మంగళ కరమైన రాత్రి అని అర్థం. ఈ రోజు మధ్యరాత్రి శివలింగోద్భవం జరిగింది. ఈ స్థాణువైన శివలింగం కొనామొదలు తెలసుకుని ప్రయత్నించి బ్రహ్మ విష్ణువులు విఫలురయ్యారు. అంటే పరమేశ్వరుని ఆది అంతాలు కనుగోడం కష్టమని చెప్పడానికే ఈ కథ పుట్టింది. త్రిమూర్తులు ఒకేదైవం యొక్క విభిన్న గుణాల ప్రతీకలు- సృష్టి స్థితి లయకారులు. రూపభేదమూ గుణభేదమూ మనము నిర్మించుకొన్నవే.

మన ధార్మికులు

# శ్రీ రామకృష్ణ పరమహంస

(1836 ఫిబ్రవరి 18 పరమహంస జననం)

- శ్రీవిశ్వ

యోగులకు అవతార మూర్తులకు భరత వర్షం పురిటి గడ్డ. శ్రీరామ కృష్ణ పరమహంస 1836వ సంవత్సరం ఫిబ్రవరి 18వ తేదీన వంగ దేశంలోని కామార్పుకుర్ గ్రామంలోజన్మించారు. గంగాదేవి క్షుదీరాములు జననీ జనకులు; గదాధరుని అంశగా జన్మించారని వీరికి గధాధరుడని పేరు పెట్టారు.

వీరి జీవితమంతా విలక్షణతతో, దివ్య సందేశంతో నిండి ఉంది. చిన్న తనం నుండే. నాటకాలన్నా, భగవన్నామ సంకీర్తనలన్నా ఇష్టపడేవారు. దేవతా విగ్రహాలను చూడ ముచ్చటగా. తయారుచేసే వారు. భగవత్ సాక్షాత్కారానికై తపించిపోయేవారు. ఆ తపనలో బాహ్య ప్రపంచ స్మృతిని గోల్పోవుట తరచూ జరిగేది.

గంగానదీ తీరాన దక్షిణేశ్వర్ గ్రామం కలకత్తాకు ఉత్తరాన నాలుగు మైళ్ళ దూరంలో ఉంది. జమీందారిణి యగు రాణి రాస్మణి దేవి అక్కడ దేవాలయాన్ని నిర్మించింది. ఈ దేవాలయంలో అర్చకుడుగా నియమితుడైన పిదప వీరి జీవితం గొప్పమలుపు తిరిగింది. ఇచ్చట వెలసిన రాధాకృష్ణులను కాళికామాతను సాక్షాత్కరింపచేసుకొన్నారు. వంగదేశపు గోస్వాముల భక్తి ప్రభావము వీరిపై బలంగా పడింది. అందుకే ప్రేమభక్తికే ప్రాధాన్యమిచ్చి దాస్య శాంత సఖ్యాది భక్తులు సాధన చేశారు. పూజాకార్య తన్మయత్వంలో గంటల కొలది శరీర స్మృతిని కోల్పోయేవారు. వివిధ మంత్రముల నుచ్చరించేటపుడు ఇతర అర్చకులు ఊహించుకొనే అంశాలను ఈయన ప్రత్యక్షీకరించుకొనేవారు. వీరి దివ్యోన్మాదం పిచ్చితనంగ్గ భావించబడుటచే, తల్లి చంద్రాదేవి స్వగ్రామానికి పిలిపించుకుని వైద్యం చేయించింది. అక్కడ రేయింబవళ్లలో చాలా భాగం శ్మశానంలో కూర్చొని తపస్సు చేసి దేవిని సాక్షాత్కరింపచేసుకొన్నారు. ఈ కాలమందే వీరి ఆదేశాను ప్రకారం శారదామణితో మాతృమూర్తి వీరికి వివాహం జరిపింది. ఈ శారదా మణియే తర్వాత మాతృశ్రీగ, ఆదర్శ గృహిణిగ. భక్తురాలిగ ఖ్యాతి గాంచింది. శారదా దేవిగా కీర్తింపబడింది.

వీరు వివాహం పిదప కొంతకాలానికే దక్షిణేశ్వర గ్రామానికి తిరిగి వచ్చారు. వీరి దివ్యోన్మాదం పిచ్చిగాదని, శాస్త్రములందున్న మహాభావమే అదియని, వీరవతార పురుషులని లోకానికి ప్రథమంగా చాటిన సన్యాసిని భైరవీ బ్రాహ్మణి మహా పండితులని ప్రసిద్ధి గాంచిన వైష్ణవ చరణుడు. గౌరీకాంత తర్కభూషణుడు మొదలైన వారు శాస్త్ర సమావేశంలో

అంగీకరించక తప్పింది కాదు ఆ బ్రాహ్మణియె తర్వాత ఇరువది నాలుగు తంత్ర గ్రంథాల్లోని సాధనలను వీరిచే జయప్రదం చేయించింది వీరికి ఆధ్యాత్మిక విద్య గరపిన మరొక గురువు తోతాపురి. తోతాపురి ఆధ్యాత్మిక జ్ఞానం రామకృష్ణుల సాహచర్యం చేతనే ఔన్నత్యాన్ని పొందింది.

చంద్రుడు, గిరిజ వంటి యోగి పుంగవులు, రామ్‌లాలా, నారాయణ శాస్త్రి వంటి సాధువులు, పద్మలోచనుని వంటి సర్వశాస్త్ర పారంగతులు వీరిని గురువుగ భావించారు. కేశవ చంద్రసేను, ఆయన బ్రాహ్మ సమాజం కొంత క్రైస్తపచ్ఛాయను కల్గి ఉండుట వల్లవారికి భగవంతుని మహిమాతిశయములను స్తుతించుటే ముఖ్య ప్రాధానగా ఉండేది భగవంతుని మహిమను స్తుతించుటకంటే, ఆతనిని చేరే ప్రేమ మార్గం ఉత్తమమని వారిని సగుణ బ్రహ్మం వైపు నడిపించారు రామకృష్ణ పరమహంస. ఇక వీరికి ప్రత్యక్ష శిష్యులు అనేకులు కలరు. వారిలో హిందూమతానికి ఖండాంతర ఖ్యాతిని కూర్చిన వివేకానంద స్వామి మకుటాయమానుడు. వీరితోపాటు సన్యాస శిష్యుల్లో బ్రహ్మానందస్వామి. ప్రేమానందస్వామి మున్నగు వారెందరో ఉద్దండులు కలరు.

వీరి సందేశం దివ్యమైనది. ఈ షణ్ణత్రయాలని కామకాయ వ్యామోహాలను గెలిచి ఈ పరోక్ష జ్ఞాన సిద్ధి పొందుటే జీవిత పరమార్థమని బోధించారు. ప్రపంచమంత అనిత్యత్వ స్వభావంకలది. బోధానుసరణం, భగవద్భక్తి, నిష్ఫలాపేక్ష, యుక్తాయుక్త విచక్షణాల ప్రాముఖ్యం గూర్చి తరచూ వివరించే వారు. కుల విచక్షణను అంగీకరించలేదు. నూతనంగా వటుడైన పిదప కమ్మర స్త్రీ 'ధని' నుండి ప్రథమ భిక్షను స్వీకరించుటే దానికి తార్కాణం. ధనమును, మట్టి బెడ్డలను ఇరుచేతులందుంచుకుని ధనం విలువను మట్టి బెడ్డలోనికి మార్చి గంగానదిలో పారవేసి ధన వ్యామోహంపై విజయాన్ని సాధించాడు. గృహస్థుడైన ఆజన్మాంతం కఠిన బ్రహ్మచర్యాన్ని అవలంభించారు. ఘోషా పద్ధతిని తిరస్కరించారు. స్త్రీ శీలాన్ని కాపాడుటకు మార్గమామెను పరదాల చాటున బంధించుట కాదని చక్కని చదువు ., భగవంతునిపై భక్తి మాత్రమే తోడ్పడునని చెప్పారు. అహంభావాన్ని ఆయన తన జీవితంలో ఎన్నడు ప్రదర్శించ లేదు. బండ్లకొలది పుస్తకములు చదివిన నేను సంపాదించలేని పరమార్థాన్ని ఈయన ఒక్క పుటయైనను చదవకయే పొందెనని సర్వ శాస్త్ర పారంగతుడని ప్రసిద్ధి చెందిన పద్మలోచనుడు పేర్కొనుటయే పరమహంస దివ్యజ్ఞానానికి పరాకాష్ఠ.

వేదోపనిషత్తులు, భగవద్గీత బోధించిన సనాతన ధర్మం కర్మానుష్ఠానం వీరి జీవితంలో సందేశంతో నిండి ప్రపంచానాకి మార్గదర్శకములైనవని చెప్పవచ్చును. మహాపురుషులైన వీరు 1986 ఆగస్టు 16వ తేదీ ఉదయం మహాసమాధిని పొందారు.

# శివాజీ బాజీ తానాజీలు

డా॥ పి. వెంకటరామశాస్త్రి

1. శివాజీ

జాజీబాయి గర్భశుక్తి ముక్తాఫలమైన శివాజీ తన పదహారవ యేట పూనా మరియు ఇతర జాగీరులను చేజిక్కించుకున్నాడు. తన రాజ్యాన్ని పన్నెండుమండలాలుగా విభజించాడు విశ్వాసపాత్రులయిన వీరుల సహాయంతో 'తోరణ' మొదలైన దుర్గాలను వశపరచుకున్నాడు. తన తల్లి జీజీబాయి, గురుదేవుడైన రామదాసుయోగి ప్రబోధాలతో ఈ వీరుడు మూర్తీభవించిన దేశభక్తిగా తయారయ్యాడు. ఔరంగజేబు సైన్యాలను అనేక దాడులలో ముప్పుతిప్పలు పెట్టాడు. సువిశాల మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపనకు పూనుకున్నాడు. కాషాయాంబర పతాకాన్ని ఎగరవేశాడు.

శివాజీ మొగలు సైనికులపై మెరుపు దాడులు జరిపేవాడు. ఆప్రాంతాలను దోచుకోడానికై వచ్చిన వారికి నిలువ నీడలేకుండా చేసేవాడు. వారు కొల్లగొట్టిన ధనరాశులను చేజిక్కించుకునేవాడు. కపటంతో, మోసంతో కుయుక్తులతో ముందుకు వచ్చిన విదేశీ పాలకులకు తగిన గుణపాఠాలు చెప్పాడు. ముల్లును ముల్లుతోనే తీయాలనేది ఇతడి సరియైన ఆలోచన.

శివాజీ శిక్షణలో ఎందరో వీరులు, దేశభక్తులు, తయారయ్యారు. వారిలో బాజీ తానాజీలు చరిత్ర ప్రసిద్ధి చెందారు.

2. బాజీ ప్రభుని ప్రభుభక్తి

బాజీ ప్రభుడు శివాజీకి కుడిభుజంగా నిల్చిన యోధుడు. ఇతడొక సమయంలో శివాజీ ప్రాణాలను కాపాడాడు. ఆ ప్రయత్నంలో తన ప్రాణాలను బలిదానం చేశాడు.

'పన్హారా'' దుర్గం శత్రు హస్తగతమయినపుడు శివాజీ అర్ధరాత్రి అగడాన్ని వదిలి సురక్షితమైన 'రాంగడా'న్ని చేరాలని తలచాడు. శివాజీ (రాంగడా'న్ని చేరేలోగా ఇరుకైన లోయదారి నుండి చీమలబారులాగా దుర్గాన్ని సమీపిస్తున్న శత్రుసైనికులను ముందుకు రాకుండా అడ్డుకోవడానికి బాజీ ప్రభువు పూనుకున్నాడు. ఇతడు కొద్దిమంది యోధులలో ఆప్రాంతాన్ని చేరుకున్నాడు. శత్రు సైనికులు ముందుకు రాకుండా నిరోధించాడు. ఆ ప్రయత్నంలో బాజీ ప్రభుని వస్త్రాలు ఎర్రమందారాలుగా మారాయి. అయినా ఈ యోధుడు తన పట్టును వదలలేదు. అస్తమిస్తున్న సూర్యునిలాగా ప్రాణాలను కూడగట్టుకుని నిలిచాడు.

ఆత్మవిశ్వాసాన్నే ఊపిరిగా తీసుకోసాగాడు. శివాజీ 'రాంగడా'నికి తనవారితో క్షేమంగా చేరిన సంకేతంగా పేల్చిన ఫిరంగి శబ్దాలను వింటూ బాజీప్రభువు తృప్తిగా ప్రాణాలను వదిలాడు.

### 3. తానా [illegible]గనం

1667వ సంၤၤనాటికి 'రాయగడం' 'సింహగడం'దుర్గాలు శివాజీ పాలనలో లేవు ఇవి మొగలుల ఆధీనంలోనే ఉన్నాయి. మొగలులతో ఏర్పరచుకున్న సంధి షరతు ప్రకారం రెండేళ్ళు (1667-1669) యుద్ధాలు లేకుండా గడిపిన తర్వాత శివాజీ దృష్టి ఈ దుర్గాలపై ప్రసరించింది వీటిని తిరిగి సాధించాలనుకున్నాడు. తన అభిప్రాయాన్ని సభలో ప్రకటించాడు. శివాజీ కొలువులో ఉన్న తానాజీ మాలుసుర్ సింహగడ దుర్గాన్ని సాధిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. వెంటనే కొంతసేనతో ఆదుర్గం వైపుకు బయలుదేరాడు.

సింహగడ దుర్గం ముక్కోణాకారంలో ఉండేది. ఆ దుర్గంపై మూడు బురుజులుండేవి. ఆ గడం తూర్పు వైపు నిర్మలజలమయమై శత్రు దుర్భేద్యంగా ఉండేది. అందువల్ల ఆ వైపు సైనికుల కాపలా ఎక్కువగా ఉండేది కాదు.

తానాజీ తన తమ్ముడు సూర్యాజీతో వెయ్యి మంది సైనికులతో సింహగడాన్ని సమీపించాడు అయిదు వందల మంది సైనికులకు తాను నాయకత్వం వహించాడు ఈ యోధుడు గజాన్నధిరోహించి ముందుగా కోటపై పోరుప్రారంభించాడు తర్వాత ఇతడి తమ్ముడు మిగిలిన అయిదు వందల మంది సైనికులతో కోట పైభాగాన్ని చేరుకున్నాడు.

అటు రాజపుత్ర సైనికులకు ఇటు మరాఠా సైనికుల మధ్య యుద్ధం భయంకరంగా సాగింది. రాజపుత్రులకు ఉదయభానుడు నాయకత్వం వహించాడు. ఈ యుద్ధంలో తానాజీ మూడు వంతుల విజయాన్నే సాధించి బలంగా గాయపడ్డాడు. కొంతసేపటికి ఈ యోధుడు నేలకొరిగాడు.

తానాజీ మరణంతో మరాఠా వీరులు ధైర్యాన్ని కోల్పోయారు. వీరా యుద్ధం నుండి పారిపోవడానికి ప్రయత్నించారు. ఆ సమయంలో సూర్యాజీ వీరిని తిరిగి యుద్ధానికి ప్రోత్సహించాడు. ఇతడు కోటపైకి వచ్చిన తర్వాత సైనికులు తిరిగి కోట దిగడానికి వీలు లేకుండా కోట కిందకు వేళాడే తాళ్ళనన్నింటినీ కోయించాడు. అందువల్ల మరాఠా సైనికులు ప్రాణాలకు తెగించి రాజపుత్రులతో పోరు చేయక తప్పలేదు. రాజపుత్రుల నాయకుడైన ఉదయ భానుడు కూడా కొంతసేపటికి నేలకొరిగాడు. కోట మరాఠాల వశమైంది.

సింహగడ దుర్గాన్ని సాధించడంలో ప్రముఖ పాత్ర వహించి ప్రాణాలను కోల్పోయిన తానాజీని చూసి శివాజీ అశ్రుతర్పణం వదిలాడు. సూర్యాజిని సింహగడానికి అధిపతిని చేశాడు.

✻

# శ్రీరుద్రమ్

-డా॥ ఎం.వి.ఆర్. శర్మ

నమ ఉచ్చై ర్ఘోషాయా క్రిందయతే పత్తీనాం పతాయేనమః

ఉచ్చైర్ఘోషాయ = శత్రువులతో యుద్ధాదులు చేయునప్పుడు హుంకరించు నట్టిరుద్రునకు నమస్కారము. విశ్వసృష్టి కూడా శబ్దము నుండియే జరిగినదని మన సంప్రదాయం చెపుతూ ఉన్నది. ఆధునిక విజ్ఞాన శాస్త్రం ద్వారా కూడా యిదే భావనను నిర్వచించుటకు ప్రయత్నిస్తున్నారు కరాటే మొదలైన ఆయుధరహిత యుద్ధములలో కూడా శక్తిని కేంద్రీకరించుటకు. లేదా శక్తిని ఏకోన్ముఖంగా ప్రదర్శించుటకు శబ్దమును ఊతగా తీసుకొనుట మనకు తెలిసినదే. హుంకారము మొదలైన యుద్ధాంతర్గత శబ్దములు కేవల ధ్వని మాత్రముననే. క్రియాన్వితములు కాకముందే శత్రువుల మనస్సులలో దడ పుట్టించును.

ఆక్రందయతే = ధర్మ విరోధులను రోదింప చేయువాడగు రుద్రునకు, పత్తినాం పతయే= సేనానాయకమూర్తి, పరాక్రమ వంతుడు, అయిన రుద్రునకు నమస్కారము.

హిందూ ధర్మంలో దైవం పరాక్రమశాలి, శక్తిమంతుడు అధర్మాన్ని ఎదుర్కొని, కఠినంగా అణిచే వాడు. అసలు ఎంత గొప్ప వాడైతే మాత్రం ఏమిటి? ఎందుకు నమస్కరించాలి? మనం నమస్కరిస్తే దైవానికి ఏ ప్రయోజనమూ లేదు గౌరవించకపోతేనే మనకు నష్టం.

ప్రతి బధ్నాతిహిశ్రేయః పూజ్యాపూజీవ్యతిక్రమః రఘువంశం 1-79. మనం పూజించినందువల్ల పూజ్యులకు క్షతి యేమీ వుండదు. మనకు కలుగవలసిన మేలునకు మాత్రం ప్రతి బంధమేర్పడి తీరుతుంది.

ఇంతకూ ఈ రుద్రుణ్ణి ఎలా అర్చించాలి? నారుద్రోరుద్ర మర్చయేత్. అనేది మన వైదిక సంప్రదాయం రుద్రుని వలెనే పరాక్రమ వంతులమగుటయే మన ప్రథమ కర్తవ్యం. రుద్ర పూజకు అర్హత అప్పుడే మనకు లభించేది

ముప్పయిమూడు రాశుల (కోట్ల) దేవతా తత్వాలను హిందూ దేశంలో ఆరాధిస్తాము. ఎవరి అభిరుచికి తగిన దేవతను వారు ఉపాసించే స్వతంత్రం మనకు ఉన్నది. హిందువులకు యిందరు దేవతలుండగా, ఆయా దేవతలను ఆయా సాత్వికాది లక్షణాలు సమ పాళ్ళతో వుంటూ వుండగా రుద్ర తత్త్వమునే ఆవహింపచేసి కొనుట. ఎందుకు?

హిందువులకు వేదము పరమ ప్రమాణము. వేదములలో శివతత్త్వ బోధక మంత్రరాశియే ఎక్కువ.

వేదములకు పురాణములు ఉపబృంహముల వంటివి. ఈ పురాణములు పద్దెనిమిది. వీటిలో ఎనిమిది మొత్తము శివేతర దేవతా తత్త్వములను గురించి చెబుతూ వుండగా పది పురాణాలు కేవలం శివ పారమ్యాన్ని వివరిస్తూ ఉన్నాయి.

మొత్తం 18 పురాణాల లోనూ ఉన్న శ్లోక సంఖ్య నాల్గు లక్షలు. అందులో 17 పురాణాలు కలిసి మూడు లక్షలు కాగా ఒక్క స్కాంద పురాణము (శివసంబంధి) లక్ష శ్లోకాత్మకము. ఏతావాతా తేలేది యేమంటే హిందుత్వము ముఖ్యముగా రుద్రత్వము-పరాక్రమత్వము, గౌణముగా ఇతర దేవతా తత్త్వములును మిశ్రితమై యున్నది. దురదృష్ట వశమున కొద్ది శతాబ్దులుగా ఆ జ్వాల క్రమేపి తగ్గి నివురుగప్పిన నిప్పువలె వున్నది. మనమందరమూ ఆత్మ పరిశీలన చేసుకుని పునరుద్దీపనకు పొందవలసిన తరుణం ఆసన్నమైంది.

# ఆధ్యాత్మిక తేజం- శ్రీశ్రీశ్రీ అవ్వల్‌నారాయణ గారు

-డా॥ దాశరథుల బాలయ్య

వేదాలు అవతరించి, పురాణాలు పుడిసిలించి ఆధ్యాత్మిక పరిమళాలను అఖిల ప్రపంచానికి అందించింది ఒక్క భారత దేశమే. సాధువులు సత్పురుషులు, ఋషులు, యోగులు, అవతరించింది ఈ దేశంలోనే. ప్రజా చైతన్యం కోసం తమ జీవితాలను పునరంకితం చేసిన త్యాగధనులు ఎందరో ఈనాటికీ ఉన్నారు.

ఈ దేశాన్ని కసాయి దొరలు పరిపాలించినపుడు వారిపై కన్నెర్ర చేసి హిందూ బంధువులందరినీ ఒక్క త్రాటిపై నడిపిస్తూ మన సంస్కృతినీ, జాతీయతను కాపాడిన వారిలో శ్రీశ్రీశ్రీ అవ్వల్‌నారాయణ గారొకరు.

నిజాం నిరకుశత్వంఒకవైపు, రజాకార్ల ఆరాచకాలు మరోవైపు తెలంగాణా పల్లె ప్రాంతాన్ని అల్లకల్లోలంచేశాయి. స్త్రీల మానభంగాలు, జమీందార్ల పెత్తనము, భూస్వాముల అకృత్యాలతో పల్లెలు చిన్న వోయాయి. ఆకలి మంటలతో, అశాంతితో ప్రజలకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది.

ఆకాలంలో తెలంగాణాలోని వరంగల్ జిల్లా అట్టుడికి నట్లు ఉడికిపోతుండేది. వరంగల్ జిల్లాలోని చేర్యాల మద్దూరు, లద్దునూరు, ఆకునూరు మున్నగు ప్రాంతాలు ముసల్మానుల ప్రాబల్యంతో క్రుంగిపోయాయి. దేవాలయాలు విధ్వంసమైనాయి. ఉర్దూభాష ప్రజలపై రుద్దబడింది, మతం మార్పిడి విచ్చలవిడిగా కొనసాగింది.

ఈ విపత్కర పరిస్థితుల నెదిరించుటకై దీక్షా కంకణం ధరించినవారు శ్రీ అవ్వల్ నారాయణ గారు. వీరు చేర్యాల మండలంలోని ఆకునూరు గ్రామ నివాసి. ఈయన ఆకునూరులో నిష్కామకళా కేంద్రం స్థాపించారు. అన్ని వర్గాల వారిని ఒక్కచోటికి చేర్పించి, విద్యాసౌకర్యం లేని ఆకాలంలో వయోజన పాఠశాలలు ఏర్పాటు చేశారు. ఎందరో పేద విద్యార్థులకు విద్య, వసతి అవకాశాలు , యోగాసనాలు, హరికథలు, బుర్రకథలు, యక్షగానాలు, రామలీలా నాటక పోటీలు నిర్వహించి ప్రజల్లో కళాభిరుచిని పెంపొందించారు. హిందూ మతాభి మానాన్ని నూరిపోశారు.

చేర్యాల, జనగామ ప్రాంతాల్లో శ్రీ అవ్వల్ నారాయణ గారి సేవా కార్యక్రమాలు ప్రజల మన్ననలు పొందాయి. ఆయన స్థాపించిన నిష్కామకళా కేంద్రంలో విద్యనభ్యసించిన వారెందరో యీనాడు డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, యూనివర్సిటీ ప్రొఫెసర్లుగా, లెక్చరర్లు ఉద్యోగాలు చేస్తున్నారు. వీరందరి అభ్యున్నతికి ఆనాడు అవ్వల్ నారాయణ గారు పెట్టిన భిక్షయే ప్రధాన కారణము. కనుక ప్రజలు వీరిని అవ్వల్ అని సంబోధించారు. అవ్వల్ అనేది నారాయణ గారికి ప్రజలిచ్చిన బిరుదు.

శ్రీ అవ్వల్ నారాయణ గారు ఎన్నో కవితలు పాటలు, కీర్తనలు, రచించి నిజాం ప్రభుత్వంపై విరుచుకపడ్డారు. ఒకవైపు దేశభక్తి భావాలు, మరోవైపు ఆధ్యాత్మిక భావాలు

ఆయన ప్రచారం చేశారు. యోగాభ్యాసం చేసి ఆధ్యాత్మ ప్రబోధం గావించారు. ఎందరో శిష్యులను తయారుచేశారు. దాదాపు ముప్పది సంవత్సరాలు మౌన వ్రతం పాటించి. భారతదేశ ప్రసిద్ధి గాంచిన మర్రి ముచ్చాల నివాసియైన శ్రీశ్రీశ్రీ సాంద్రానంద నరసింహ స్వామి వారు శ్రీ అవ్వల్ నారాయణ గారి శిష్యుడే అన్న విషయం గమనించ దగింది

అప్పటి మన ముఖ్యమంత్రి డా మర్రి చెన్నారెడ్డి గారు, పార్లమెంటు సభ్యురాలు లక్ష్మీభాయి గారు, రాష్ట్ర మంత్రి హయాగ్రీవాచారి గారు, వీరి నిష్కామ కళాకేంద్రాన్ని దర్శించి వీరి సేవలను గుర్తించి ప్రశంసించారు.

ఎందరో కవులు, కళాకారులు. మేధావులు, నాయకులు, విద్యావంతులు ఆకునూరు నిష్కామ కళాకేంద్రంలో శిక్షణ పొందారు.

దాదాపు ఎనిమిది సంవత్సరాల నుండి వీరు యోగ సమాధిలో నుండి ఇటీవలనే బ్రహ్మపదమునందించినారు. స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భాన వీరిని స్మరిస్తూ, వీరి సేవలు నేటి తరానికి స్ఫూర్తి దాయకములు కాగలవని విశ్వసించుచున్నాము.

---

## జీవిత సభ్యులు

**శ్రీ పేరిశెట్ల వెంకటరమణయ్య**
సజ్జావారి వీధి
కోవూర్ - 524137 నెల్లూరు(జి)

**శ్రీ కె. విఠలయ్య**
ఇ.నెం. 20-34, కృష్ణధామం, శ్రీ కోదండ రామ్‌నగర్
సి.పి.ఐ.టి. కాలనీ. హైదరాబాద్ - 500060

**శ్రీ డి. ఉమామహేశ్వరరావు**
3-5-262/1, విఠల్ వాడి,
నారాయణగూడ, హైద్రాబాద్

**శ్రీ షిర్డీసాయిబాబా సంస్థాన్ ట్రస్ట్**
సాయిబాబానగర్, దిల్‌సుఖ్‌నగర్,
హైద్రాబాద్ - 60.

**శ్రీ కె. సాయిరాం**
ఫ్లాట్ నెం 4, అశ్వినీ అపార్ట్‌మెంట్సు, దానవాయిపేట 3 లైన్,
రాజమండ్రి, తూ.గో. జిల్లా - 533103

జై హింద్ | గ్రామగ్రామంలో | జై శ్రీరాం

# శ్రీరామ మహాయజ్ఞాలు

దేశ కల్యాణాన్ని ఆశించి విశ్వహిందూ పరిషత్ శ్రీరామ మహాయజ్ఞాలు నిర్వహిస్తున్నది యజ్ఞః అన్నమాటకు పరమాత్ముడనే అర్థమున్నది జనతా జనార్దనుని రూపమే పరమాత్ముని విరాడ్రూపం. ఆ విరాడ్రూప తత్త్వం తెలుసుకోవాల్సి ఉంది ప్రజలందరూ తాము భగవంతుని బిడ్డలమే అని గుర్తించాల్సి ఉంది దీని వల్ల అందరిలో సమభావన కలుగుతుంది

విశ్వహిందూ పరిషత్ ఈ దేశాన్నే దైవంగాకొలవాలంటున్నది భారతమాత అనే దైవాన్ని కొలవడమే ఈ యజ్ఞం పరమోద్దేశ్యం

అయితే హిందుత్వ పరిరక్షణ లేకుండా ఇవాళ దేశం నిలిచేట్లు లేదు. హిందువుల అస్తిత్వాన్ని పరిరక్షించే మర్యాదా పురుషోత్తముని వంటి ఉత్తమ నాయకులను మనం నిర్మాణం చేసుకోవలసి ఉన్నది. అటువంటి నాయకుల ద్వారానే హిందూ ధర్మం, హిందూ జాతి వికాసం. హిందూత్వ రక్షణ జరుగుతుందనేది సత్యం. అందుకే ఈక్రింది మూల బిందువులైన అంశాలు పరిరక్షించ బడాలని శ్రీరామ మహాయజ్ఞంలో మనం సంకల్పం చెప్పుకొంటున్నాం.

1. గోరక్షణం :

అనాదికాలం నుండి ఈదేశాన్ని పోషించి రక్షిస్తున్నది గోవు. పాడి పంటలకు మూలాధారంగా నిలిచి సర్వజీవులకూ పుష్టినీ, తుష్టినీ ఇస్తున్నది. కలి పురుషుడు గోరూప భూదేవిని హింసించిన ఘట్టం భాగవతంలో ఉన్నది. అప్పుడు పరీక్షిత్తు ఇలా అంటాడు.

"సాధువులగు జంతువులకు
బాధలు గావించు ఖలుల ఖండింపని రా
జాధము నాయుస్స్వర
శ్రీ ధనములు వీటి పోవు సిద్ధము తల్లీ!"
దుష్ట జన నిగ్రహంబును
శిష్ట జనాను గ్రహంబు చేయగ నృపులన్
స్రష్టవిధించె పురాణ
ద్రష్టలు చెప్పుదురు పరమ ధర్మము సాధ్వీ!'

ఆ తర్వాత కలిని శిక్షించి గోరూప భూమాతను రక్షిస్తాడు. అయితే హిందూ దేశంలో రోజూ గోహత్య జరుగుతున్న ప్రస్తుత వాతావరణాన్ని మార్చే ఉత్తమ ప్రభుత్వం కావాలని మనం కోరుకోవలసి ఉంది. అందుకే శ్రీరామ మహాయజ్ఞ సంకల్పంలో ఈ విషయాన్ని ప్రస్తావించడం జరిగింది.

2. రామ-కృష్ణ-విశ్వనాథ మందిరాల నిర్మాణం :

అయోధ్యలో రామజన్మ భూమి మందిరం, మధురలో కృష్ణ మందిరం, కాశీలో విశ్వనాథ మందిరాలు పునరుద్ధరణ జరగాలి. విదేశీ దురాక్రమణ దారులు దేశంలో ముప్పయివేల పై చిలుకు మందిరాల్ని కూల్చి వేశారు. నిన్న గాక మొన్న అంటే 1998 జనవరి

26వ తేదీన పవిత్ర గణతంత్ర దినోత్సవాన్ని అపవిత్రం చేస్తూ 23 గురు కాశ్మీర్ హిందు ప్రజలను అతిక్రూరంగా అమానుషంగా పిల్లనక తల్లనక చెల్లనక వృద్ధులనక సంహరించి ఓ మందిరాన్ని విధ్వంసం చేశారు. ఎన్నికల సంరంభంలో కొట్టుకు పోతున్న ఏ పార్టీకి చీమకుట్టినట్టయినా లేదు. ప్రభుత్వాలూ, పార్టీలు మెత్తని ధర్నా నిర్వహించుకొన్నాయి తమ తమ ప్రదేశాల్లో తాటాకు చప్పుళ్లకు కుందేళ్ళు బెదరవు. నిర్వీర్య నపుంసక ప్రభుత్వాలున్నంతకాలం సైతాన్ శక్తులు విజృంభిస్తూనే ఉంటాయి. మళ్లీ ఔరంగ జేబుల కాలం వస్తుంది.

ఆకాలం రాకూడదనుకొంటే అయోధ్య కాశీ మధురా మందిరాలతోపాటే, అపవిత్రము, విధ్వంసం చేయబడ్డ మిగతా ముప్పయివేల దేవాలయాలను పునరుద్ధరించేప్రభుత్వం కావాలి. విదేశీ వంచక సృగాలాల ముందు తలవంచే శక్తిహీనులూ, శక్తి హీన ప్రభుత్వాలు ఈ దేశ అస్తిత్వానికే ముప్పు తెస్తాయి. అందువల్ల శ్రీరామ మహాయజ్ఞాల సందర్భంగా తీసుకొనే సంకల్పంలో భవ్యమందిరాల నిర్మాణాన్ని స్వీకరించాం. చిన్న మందిరాల్నే నిర్మించుకోలేని మనం, రక్షించుకోలేని మనం, విసింపచేసుకోలేని మనం ఈ దేశమనే మందిరాన్ని ఎలా వికసింప చేయగలుగుతాం!

3. మతాంతరీకరణల ప్రమాదం :

హిందూదేశం మీద విదేశీయులు అనేక పర్యాయాలు దండయాత్రలు చేశారు. జాతి బలంతో ఎదుర్కొంది. ఓడించింది, ఒక్కోసారి ఓడిపోయింది. దురాక్రమణ దారులెందరో జాతిశక్తి ముందు తలవంచి ఈ జీవన స్రవంతిలో కలిసి పోయారుకాని, పదవ శతాబ్దం నుండి వచ్చిన ముస్లిం దురాక్రమణ దారులు తమ ప్రత్యేకతను నిలుపుకునే ప్రయత్నం చేయడమే కాక, బలవంతాన ఈ భూమి పుత్రులను మతం మార్చడం ప్రారంభించారు. ఈ దేశంలో తమ సంఖ్యను పెంచి దీన్ని తమ మతదేశంగా మార్చుకోవాలనే ఆలోచన ఆ తర్వాత వచ్చిన బ్రిటిషు క్రైస్తవ రాజ్యానికీ వచ్చింది. ఈ రెండు విదేశీ మతాల వారు కులం, వర్ణం, భాషా, ప్రాంతం పేరిట దేశంలో హిందువుల్లో చీలికలు మరీ పెంచారు. ప్రలోభాలు చూపడం, మానసిక దౌర్బల్యం సృష్టించడం ఇలా ఎన్నో షడ్యంత్రాలు కుతంత్రాలు ప్రయోగించి స్వతంత్ర భారతంలో ఎందరినో మతం మార్చారు. స్వాతంత్ర్య వీరసావర్కర్, స్వామి శ్రద్ధానంద తదితరులెందరో హిందువుల పునరాగమన కార్యక్రమం ప్రారంభించి వేలాది మందిని మళ్ళీ తల్లి ఒడిలోకి తెచ్చారు. కాని స్వతంత్ర భారతం కుహనా సెక్యులర్ ప్రభుత్వాలు దేశంలో వస్తున్న పరిణామాలు గుర్తించక, అడుగడుగునా ముస్లింక్రైస్తవ సంతృప్తీకరణ విధానాలుపాటించి, హిందువులను రెండో తరగతి పౌరులుగా చూడడం ప్రారంభించాయి. ముస్లిం క్రైస్తవ ఓటు బ్యాంకు కొరకు దేశాన్ని చివరికి రాజ్యాంగాన్ని కూడా ఫణంగా పెట్టడానికి ఈ ప్రభుత్వాలు వెనుకముందాడ లేదు. అకారణంగా దేశంలో విదేశీ మతశక్తులు దినదినం బలపడనారంభించాయి. ఈ దేశాన్ని తమ మత సామ్రాజ్యవాద దేశాల మద్దతుతో ఆక్రమించాలని ఈ దుష్ట శక్తులు కలలు కంటున్నాయి.

కేవలం కుర్చీకొరకే కొట్లాడే, దేశభక్తిలేని దౌర్భాగ్య పార్టీలన్నీ, దేశం విదేశీ మతాల చేతుల్లోకి పోతుందని గుర్తించలేక పోతున్నాయి. పైగా గుర్తించి హిందూ శక్తుల ఏకతకు పాటుపడుతున్న వారిని, పాటుబడుతున్న సంస్థలను 'మతోన్మాద' మనే ముద్రతో భయపెడుతున్నాయి. వీళ్ళకు వత్తాసు పలికే వామపక్ష కుహనా మేధావులు తాము కూచున్న

కొమ్మను తామే నరుక్కొంటున్నారు. వీరిబండారాలన్నీ బయటపడుతూనే ఉన్నాయి. అందుకే దేశభక్తి గల యువశక్తిని జాగృతం చేయాలనే ఉద్దేశ్యంతోనే ఈ శ్రీరామ మహాయజ్ఞాల సందర్భంగా చేసే సంకల్పంతో దేశానికి అపకారం కలిగించే మతాంతరీకరణాన్ని నిరోధించాలనే మంత్రాన్ని చేర్చడం జరిగింది.

4. గంగను రక్షిద్దాం - మఠమందిరాల స్వయత్తత సాధిద్దాం

మనం భూమాతను గోమాతను పూజించినట్లే గంగామాతను పూజిస్తాం వేదమాతనూ గీతా మాతనూ శక్తి నివ్వవలసిందని ప్రార్థిస్తాం. అనేక విదేశీ కంపెనీల వల్ల, ప్రభుత్వం పట్టింపు లేనితనం వల్ల గంగ ప్రదూషితమవుతున్నది. దాని వల్ల పర్యావరణ కాలుష్యం ఏర్పడుతున్నది. గంగే మంగళ తరంగిణి అనే మాట అసత్యమై పోతున్నది. అందుకే మనం ఈ మహాయజ్ఞ సంకల్పంలో ప్రదూషణను నివారిద్దామని ప్రతిజ్ఞ చేస్తున్నాం

అంతేగాక మన మఠ మందిరాలపై ప్రభుత్వ పెత్తందారీ తనం తొలగిపోవాలని ఆకాంక్షిస్తున్నాం హైందవేతరుల మఠమందిరాలు ప్రభుత్వానికి పైసా ఇవ్వవు, పైగా ప్రభుత్వంతో అనేక ప్రయోజనాలు పొందుతుంటాయి. కాని హిందూ దేవాలయాల మీద వచ్చే ఆదాయంపై ఆస్తులపై ప్రభుత్వం తన పెత్తనం చలాయిస్తుంది హుండీలోనిడబ్బులను దిగమింగడానికి దేవాలయం మీద ఆధిపత్యం నెరపటానికి తన తాబేదారులను ట్రస్టీలుగానియమిస్తుంది. హిందూ ధర్మమంటే తెలియని వారిని నియామకం చేస్తుంది. దేవుణ్ని నమ్మని వానికి దేవుని సొమ్ము మాత్రం కావల్సి వస్తుంది. ఇలాంటి నాస్తికులు, విదేశీ ఇజాలబానిసలు అనేక అసాంఘిక శక్తులను దేవాలయ వ్యవస్థలో ప్రవేశపెట్టే ప్రయత్నం చేస్తుండడం వల్ల హిందూ దేవాలయ పవిత్రతకు భంగం కలిగే వాతావరణం ఏర్పడుతున్నది. ఈ దౌర్భాగ్యం తొలగిపోవాలి. మనదేవాలయాల్ని రక్షించి, పవిత్రతను నిర్మించి, అనేక కళ్యాణ కార్యక్రమాలు నిర్వహించే స్వతంత్ర హిందూ ధార్మిక సంస్థ చేతుల్లోకి నిర్ణాయక శక్తి రావాలనే సత్సంకల్పంతో ప్రభుత్వ సెక్యులర్ దయ్యం కౌగిలి నుండి విముక్తి కలగాలనే సదుద్దేశ్యంతో ముక్తి పూర్వక స్వాయత్తత అనే పదాలను ఈ సంకల్పంలో చేర్చడం జరిగింది.

5. రామరాజ్య స్థాపన

ఇక సంకల్పంలో చివరిది రామరాజ్యస్థాన. ఇది గాంధీ గారి జీవితంలో పరమ చరమ వాంఛ. స్వరాజ్యం సురాజ్యం కావాలంటే, స్వతంత్రం సుతంత్రం కావాలంటే రామ రాజ్యనిర్మాణం జరగాలి. మహర్షి దయానందుడు, రామ మోహనరాయ్, పరమహంస, వివేకానందుడు, రామ తీర్థ, వీర సావర్కార్, నేతాజీ, తిలక్, అరవిందులు, డాక్టర్జీ, గురూజీ తదితరులెందరో ఏ ఆదర్శరామ రాజ్యనిర్మాణానికై కలలు గని, నిరంతరం పరిశ్రమించారు. వారి పరిశ్రమ సాకారం కావాలంటే ప్రఖర కర్మిష్ఠులం కావాలి. గ్రామ పునరుద్ధరణ ద్వారా, స్వదేశీ వికాసం ద్వారా, స్వాభిమానం నిర్మాణం ద్వారా, విదేశీ దుష్టశక్తుల నిరోధం ద్వారా, స్వావలంబనం ద్వారా, సంఘటిత శక్తి నిర్మాణం ద్వారా రామరాజ్య స్థాపన వైపుగా మనం ప్రగమించాల్సిన అవసరం ఉంది.

ఇది ఆదర్శ రామరాజ్యం. రాజరికం కాదు. ఇది ధర్మరాజ్యం. అందరికీ విద్య లభిస్తుంది. అందరూ సుఖసంతోషాలతో తినడానికి తిండి, కట్టడానికి గుడ్డ, ఉండడానికి ఇల్లు, చేతి నిండా పని కలిగి జీవిస్తారు. పరస్పర సంఘర్షణలుండవు. పరస్పర

సహకారాలుంటాయి. ఆత్మీయత ఉంటుంది. మానవులు దివ్య మానవులుగా మారిపోతారు. పరిశ్రమయే పరమాత్ముడని భావించి పనిస్తారు. దేశం ఒకరికి అన్నం పెట్టే స్థితిలో ఉంటుంది. దోపిడీ ఉండదు. సామాజిక న్యాయం ఆమగడుగునా లభిస్తుంది. ఈ ఆదర్శ రామరాజ్యం ప్రపంచానికే ఆదర్శంగా నిలుస్తుంది. అందుకే రామరాజ్య ప్రతిష్ఠాయైచ అనే మాటను ఈ సంకల్పంలో చేర్చడం జరిగింది.

ఈ శ్రీ రామ మహాయజ్ఞ సంకల్ప పరమోద్దేశ్యాన్ని గుర్తించి వ్యవహరించాలని హిందూ బంధువులను పిలుస్తున్నాం. ఈ క్రింద ఇచ్చిన శ్రీరామ మహాయజ్ఞ సంకల్పంతో యజ్ఞం నిర్వహించవలసినదిగా అభ్యర్థిస్తున్నాం.

- కూర్పు : ధర్మవీర

## శ్రీ రామ మహాయజ్ఞ సంకల్పః

స్వస్తిశ్రీ మన్మహా గణాధిపతయే నమః
హరిః ఓం తత్సద్ అథ ఏతస్య భగవతో
మహాపురుషస్య అజ్ఞయా ప్రవర్త మానస్య బ్రహ్మణో Sహ్ని
ద్వితీయ పరార్థే శ్రీ శ్వేత వరాహకల్పే, జంబూద్వీపే, భరతఖండే, భరత వర్షే,
పుణ్య... క్షేత్రే, వైవస్వత మన్వంతరే, అష్టావింశతితమే, కలియుగే
కలిప్రథమ చరణే, బౌద్ధావతారే 5099 తమే యుగాబ్దే, 1919 తమే
శాలివాహన శకాబ్దే మాసానాం మాసోత్తమే మాసే శుభే
శుక్ల కృష్ణ పక్షే శుభ తిథౌ......శుభే........వాసరే,
ఉత్తరాయణే.........గోత్రాః...........నామానో
వయం దేశభక్తాః

1. అస్మాకం శ్రద్ధాకేంద్రస్య సర్వదేవమయస్య
   గోవంశస్య హత్యయా పూర్ణప్రతిబంధపూర్వక
   సర్వ విధ మాంస నిర్యాతావరోధాయ
2. భగవతో రామస్య, భగవతః కృష్ణస్య జన్మభూమ్యై
   భగవతో విశ్వనాథస్య ప్రాకట్య భూమౌ చ భవ్యమందిర నిర్మాణాయ
3. రాష్ట్ర ఘాతిని ధర్మాంతరణే తత్కాల ప్రతిబంధాయ
4. గంగాప్రవాహ రక్షణ పురఃసర ప్రదూషణ నివారణాయ
   తథా మఠమందిర ప్రభృతి ధర్మస్థానానాం సర్వకారీయ నియంత్రణ
   ముక్తి పూర్వక స్వాయత్తతా ప్రాప్తయే
5. అఖండ భారత వర్షే ధర్మ సంస్థాపనార్థాయ
   రామరాజ్య ప్రతిష్ఠాయైచ భగవత్ప్రీత్యర్థం
   గణేశాది దేవావాహన పూజన పురఃసరం
   శ్రీరామ మహా యజ్ఞాభ్యాం కర్మకరిష్యామహే ॥

★ ★ ★

# శ్రీధరణి సీతారామయోగీంద్రస్వామి (1714-1796)

- ఆచార్య బిరుదురాజు రామరాజు

ముగ్గురు మూర్తుల అవతారం దత్తాత్రేయస్వామి చతుర్యుగావతారుడు. అన్ని సంప్రదాయాలవారు దత్తాత్రేయస్వామిని గురువులకు గురువుగా అంగీకరిస్తారు త్రేతాయుగంలో ఆయన 16 అవతారాలెత్తినారు. కలియుగంలోను దత్తాత్రేయావతారాలనేకం చారిత్రకయుగంలొ దత్తాత్రేయుల పూర్ణావతారాలు శ్రీపాదశ్రీవల్లభులు, శ్రీనరసింహసరస్వతి. వీరిరువురికీ ఆంధ్రదేశంతో సంబంధమున్నది. శ్రీపాదశ్రీవల్లభుల జన్మస్థానం తూర్పుగోదావరిజిల్లా పిఠాపురం; శ్రీ నరసింహసరస్వతి అంతర్ధానమైనది. కర్నూలు జిల్లా శ్రీశైలంలో. వారి తరువాత ఎందరో దత్తావతారులు ఆంధ్రేతరప్రాంతాల్లో విలసిల్లినట్లే ఆంధ్రదేశంలోను ప్రభవించినారు. అట్టివారిలో శ్రీధరణి సీతారామయోగీంద్రులొకరు. 11వ శతాబ్దంలో నందన చక్రవర్తి కాశీనుండి 13 గోత్రాల 500 చౌడేశ్వర భక్త బ్రాహ్మణులను ఆంధ్రదేశానికి రప్పించి నందవరం అగ్రహారంగా ఇచ్చినారట. నాటినుండి ఆంధ్రదేశంలో చౌడేశ్వరీ ఆరాధనలు జరుగుతున్నవి. కాశీనుండి వచ్చి ఆంధ్రదేశంలో స్థిరపడిపోయిన ఈ 13 గోత్రాల వారిని నందవరీకులంటారు అందులొ వసిష్ఠగోత్రీకులకు మూలపురుషుడు తర్కశాస్త్రం మాధవభట్టు. ఆయన సంతతివారిలో ధరణి ఇంటిపేరుగల సుబ్బయ్య తిమ్మాంబ దంపతులు 17వ శతాబ్దంలో కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా కొట్లపాడులో స్థిరపడ్డారు. వారికి చౌడేశ్వరి కులదైవం; కంబగిరి నరసింహస్వామి ఆరాధ్యదైవం. వారి ప్రథమసంతానం రామయమంత్రి, ద్వితీయ సంతానం శేషయామాత్యుడు. వాళ్ళకు పెదకంబగిరి, చినకంబగిరి అని వ్యవహారనామాలు. కొంతకాలానికి తిమ్మాంబాసుబ్బయ్యల పుణ్యం ఫలించి శా.శకం ౧౬౩౬ జయ పుష్యబహుళచతుర్థి సోమవారం 4-1-1714 నాడు శుభముహూర్తాన మూడవకొడుకు పుట్టినాడు. అప్పటి గాలిలో దివ్యగంధాలు, దిక్కుల్లో వెలుగురేకలు ఆ గ్రామంలో ఆనందచైతన్యము వెల్లివిరిసినవి. ఆ పసికందుకు సీతారామస్వామి అని నామకరణం చేసినారు.

ముఖంలో దివ్యవర్చస్సు ఉట్టిపడుతూ సీతారామస్వామి శుక్లపక్షచంద్రునివలె చూపరులకు ఆనందం పంచేవాడు. ఆతనికి మూడునాలుగేండ్ల పిన్నవయస్సులోనే పితృ వియోగం సంభవించినది. తిమ్మాంబ అనాథయై ముగ్గురు కొడుకులనూ అతికష్టంగా సాకింది. ఆరేండ్లు వచ్చేసరికి సీతారామయ్య ప్రవర్తనంలో - వ్రేళ్ళు లెక్కపెట్టటం, పుల్లలు త్రుంచటం, పరధ్యానంగా ఉండటం వంటి - అసాధారణత్వం గోచరించింది. అందుమూలంగా కొందరాతణ్ణి వెఱ్ఱి సీతారాముడనేవారు. దీనికితోడు సీతారామస్వామి అధికంగా అల్లరి చేయటంచేత కొందరాతణ్ణి అల్లరి సీతారాముడనేవారు. భుక్తికి గడవక

తిమ్మాంబ సీతారామస్వామిని నైతుల ఆవులు కాయటానికి పంపేది గోపాలకృష్ణుని వలె. పోతులూరి వీరబ్రహ్మంవలె, పూదోటలింగావధూతవలె బాలసీతారామస్వామి పసులు కాచినాడు. కొఱ్ఱపాడు సమీపాన ఆవులను మేతకు తోలి సీతారామస్వామి వాగుగడ్డపై ఉన్న గుడివద్ద ఆడుకుంటుంటే మెడలో రుద్రాక్షమాలలు చేతుల్లో దండకమండలాలు ధరించిన ఒక యోగి వచ్చి ఆతని దివ్యవర్చస్సు గమనించి నాలుకపై బీజాక్షరాలు వ్రాసి మంత్రోపదేశం చేసి పోయినాడు. అప్పటినుండి సీతారామస్వామి దత్తాత్రేయో పాసకుడైనాడు. అనేకమహిమలు ఆతణ్ణి వలచి వచ్చినవి.

సీతారామస్వామి దత్తాత్రేయోపాసకుడైన తరువాత ఆయన చేష్టలు ఇంకా విపరీతంగా ఉండటం చేత తిమ్మాంబిక చాలా దిగులుగా ఉండేది. ఇట్లుండగా ఒకసారి సుబ్బయ్యగారి పాతస్నేహితులు బూరుగులరాచర్ల వాస్తవ్యులు ఐన వైదికపండితులు కొందరు కొఱ్ఱపాడుకు వచ్చి పూర్వస్నేహాన్ని పురస్కరించుకొని తిమ్మాంబను పల్కరించినారు. ఆమె తన దైన్యాన్ని సీతారామస్వామి పరిస్థితిని చెప్పి ఆతనికి విద్యాబుద్ధులు చెప్పవలసిందిగా వారిని కోరింది. వారు సంతోషంతో సీతారామస్వామిని తమ వెంట బూరుగులరాచెర్లకు తోడుకపోయినారు. ఆ పండితులొక శుభముహూర్తాన అక్షరాభ్యాసం చేయించి చదువులారంభించినారు. సీతా రామస్వామి పాఠాలయెడ మక్కువ చూపక నిమీలితనేత్రుడై ధ్యానం చేస్తుండేవాడు. గురువులాతనికి చదువు చెప్పటానికి శక్తియుక్తులా ప్రయత్నించి విఫలులైనారు. వారాతణ్ణి మొద్దు సీతారాముడనేవారు. ఒకసారి గురువులు విస్తరాకుల కోసం శిష్యులతో అడవికి వెళ్ళినారు. ఆకులకోసం శిష్యులు తలొక దారిన పోయినారు. సీతారామస్వామి తానొకవైపు నడిచినాడు. కాసేపటికి అందరూ మోదుగాకులు కోసుకొని వచ్చినారు కాని సీతారామస్వామి రాలేదు. మొద్దు సీతారాముడేమైపోయినాడో అని అందరూ వెదకి అడవంతా గాలించినారు. చివరకు ఒక కొండచరియన సీతారామస్వామి శీర్షాసనస్థుడై ఉండటం గమనించి బిగ్గరగా పిల్చినారు. పిలుస్తున్న కొలది సీతారామస్వామి శీర్షాసనస్థుడై యుండే శరీరం కొండెత్తు పెంచినాడు. గురువులూ మిగతా శిష్యులూ ఆదృశ్యం చూచి విస్తుపోయి మొద్దు సీతారాముణ్ణి మహామహిమోపేతుడైన యోగిగా గుర్తించినారు. సీతారామస్వామి తన నిజస్వరూపం గురువు లకు ఎరుకపరచినాడు. వారాతణ్ణి మర్యాదగా ఇంటికి తోడుకపోయి రెండు మూడు దినాల తరువాత కొఱ్ఱపాడుకు తీసుకపోయి తల్లికప్పగించి సీతారామస్వామి కారణజన్ముడనీ, సమస్త విద్యలు నేర్వకయే నేర్చినవాడనీ మునుముందాతడు సమస్త జనుల చేత పూజలందుకుంటాడనీ కనుక ఆతని యిష్టానికి భిన్నంగా ఏమీ చేయవద్దని చెప్పి సెలవు తీసుకొనిపోయినారు.

కొంతకాలం తరువాత సీతారామస్వామి తల్లితో అన్నలు తమవంశం నిలుపుతారనీ, తాను బ్రహ్మచర్యం పాలించి సన్న్యాసిగా ఉంటాననీ అనుమతి పొంది వివిధ పుణ్యక్షేత్రాలు తిరిగి నల్లమల కొండల్లోని శ్రీశైలం అహోబలం తమ తపస్సుకు అనువైన స్థలాలుగా ఎంచు కున్నారు. క్రూరమృగాలకు విషసర్పాలకు నిలయాలైన తావుల్లో శీతాతపాలకు ఓర్చుకుంటూ దీర్ఘకాలం కఠోరమైన తపస్సు చేసి భగవత్సాక్షాత్కారం పొందినారు. అష్టసిద్ధులు ఆయనకు కైవసమైనవి. అటు తరువాత దేశసంచారం చేస్తూ ధర్మప్రబోధం

చేసినారు. గ్రామాల్లో అరిష్టాలు తొలగించటం, వ్యాధిపీడితులకు ఆరోగ్యం ప్రసాదించటం ,ఆపదల్లో ఉన్నవారిని గట్టెక్కించటం, ఆశ్రయించినవారికి ముందు రాబోయే ప్రమాదాలు చెప్పి హెచ్చరించటం, భక్తుల అభీష్టాలు నెరవేర్చటం వంటివి సీతారామస్వామివారికి నిత్యకర్మలైనవి. వారి మహిమలు కన్నవారు, విన్నవారు అహమహమికతో తమతమ గ్రామాలకు వారిని తోడ్కొనిపోయి గౌరవించి పూజించే వారు. కొంతకాలం తరువాత భక్తుల ప్రార్ధనపై సీతారామస్వామివారు కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డ సమీపాన లింగందిన్నెలో తమ తపస్సుకోసం ఒకస్థానం ఏర్పరుచుకున్నారు. తమ ఆవాసానికి, తపస్సుకు, పూజలకు, భక్తులుండటానికి కావలసిన వసతులతో ఒక ఆశ్రమం, ఒక శివాలయం, కోనేరు నిర్మింపజేసినారు. అప్పటినుండి జనులందరూ లింగందిన్నెకే వచ్చి సీతారామస్వామి వారిని దర్శించిపోయేవారు. సామాన్యజనం సీతానాయన అనీ పండితులు అభినవ దత్తాత్రేయ శ్రీ ధరణి సీతారామయోగీంద్రస్వామివారనీ వ్యవహరించేవారు.

సీతారామయోగీంద్రుల సమకాలీనపండితులు కవులు తమకృతుల్లో స్వామివారు సప్తసంతానప్రతిష్ఠ చేసినట్లు వర్ణించినారు కొడుకు, నిక్షేపం, చెరువు, కావ్యం, గుడి, వనం, అగ్రహారం సప్తసంతానాలు. స్వామి బ్రహ్మచారి సన్న్యాసి కనుక కన్నకొడుకులు లేరుగాని వారి దివ్యకరకమలసంజాతులైన శిష్యులందరూ వారి సంతానమే. స్వామివారి ధర్మకార్యాలు పెక్కుచోట్ల చేయించినట్లు కావ్యాధారాలున్నవి. లింగందిన్నెలో శివాలయం తటాకం, వనం, ప్రొద్దుటూరు తాలుకా రెడ్డివారి కొట్టిపాడులో నందీశ్వరాలయం, కోయిలకుంట్ల తాలూకా భీమునిపాడులో తోట, బావి, ఆళ్ళగడ్డ తాలూకా ముత్తలూరులో తోట, బావి, యమ్మనూరులో చౌడాంబికాదేవాలయం, అంబాప్రతిష్ఠాపనం, నందవరంలో చౌడేశ్వరీ దేవాలయ జీర్ణోద్ధారం, రుద్రవరంలో ఒక తోట, వారుణఫలపురంలో దత్తాత్రేయమఠం తోట, తమ పేరుతో ఒక ఊరు పొందించి అక్కడ తరుతటాకమందిర ప్రతిష్ఠలు చేయించినారు. ఇంతలేసి ధర్మకార్యాలు ఆనాడు సన్న్యాసులు చేయటం చాలా అరుదు. స్వామివారు చేయించిన సత్కార్యాలు స్వామి శిష్యుడు రంగయామాత్యుని రామకృష్ణకవి తన చాముండికావిలాసంలోను, చౌడూరి శేషంభట్లు తన చూర్ణికలోను పేర్కొన్నారు. సీతారామయోగీంద్రులు తమ కులదైవం నందవరం చౌడేశ్వరీ దేవికి చేసిన కైంకర్యములు లెక్కకు మిక్కిలి. శా.శకం ౧౭౦౩ (క్రీ.శ. 1781) ప్లవ సంవత్సరంలో మ్లేచ్ఛాక్రాంతమై నాలుగేండ్లు పూజా పురస్కారాలు నిలిచిపోయిన అమ్మవారికి మహాప్రోక్షణం చేయించి అన్నితీరుల ఉత్సవాలు శాశ్వతంగా జరిగేటట్లు ఏర్పాటు చేసిన విషయం శా.శ. ౧౭౦౭ విశ్వావసు శ్రావణశుద్ధదశమి సోమవారం (15-8-1785) వేయించిన శాసనం వర్ణిస్తుంది. స్వామి వారెక్కడున్నా పూజా సమయానికి కామగమనంతో వచ్చి అమ్మవారిని అర్చించిపోయేవారట. అన్ని వర్ణాలవారికి అన్నసంతర్పణలు వేదపండితుల సమాదరణలు వివిధసేవలగురించి ఈ శాసనం ప్రస్తావిస్తుంది.

సీతారామస్వామివారికి జాతిమతలింగవివక్ష లేకుండా అన్ని వర్ణాల అన్ని వర్గాల శిష్యులుండినారు. వారిలో కొందరు యోగులు, కొందరు కవులు, కొందరు పండితులు. స్వామివారి యోగిశిష్యులు దొర్నిపాడు ఎరికలయ్య, రేవనూరి మస్తానయ్య, క్రిష్ణంపల్లి

జమాలయ్య, ఉ.సేనాపురం ఉసేనయ్య, పెద్దపసపుల గుమ్మటం స్వాము, గుడిపాడు వెంకటాచలకవయ్య, నెల్లూరు కసుమూరి హుసేనయ్య, గుంతకల్లు దస్తగిరి, అల్లాడపల్లి గోవిందయ్య (బ్రహ్మంగారి సంతతి), వంటి మహాపురుషులు, జీవసమాధి ఐనవారు. ఆయా తావుల్లో వారి సమాధులు ఈనాడు పూజలందుతుంటున్నవి. కొన్ని కుటుంబాల వారు స్వామిని వంశపరంపరగా ఇలువేలుపుగా కొలుస్తున్నారు. అట్టివారిలో మేడావారు వైశ్యులు. స్వామివారి గురుత్వంతో, ప్రేరణతో, పోషణతో కవిపండితులనేకులు సంస్కృతాంధ్రాల్లో కృతులు రచించి స్వామివారి మహిమాతిశయాలు కొనియాడినారు. స్వామి వారికి శిష్యులైన పండితకవుల్లో క్రిష్టిపాటి వెంకటసుబ్బకవి, శకునాల సుబ్బయ్య. రంగయామాత్యుని రామకృష్ణకవి, చవుడూరి శేషంభట్లు, వఝల సుబ్బకవి మొదలైనవారు ముఖ్యులు. ఇందులో క్రిష్టిపాటి వెంకటసుబ్బకవి పుష్పగిరి జగద్గురువులు, విద్యాశంకర భారతీస్వామిచేత, గద్వాల ప్రభువులచేత సత్కృతుడైన మహాకవి. దీబగుంట.వీరభద్రశతకం, కేదారేశ్వర మాహాత్మ్యం, హనుమచ్ఛతకం, నాడీ నక్షత్రమాల, దత్తప్రభు శతకం ఈయన రచనలు. దత్తప్రభు గేయశతక రచనకు ప్రేరకులు సీతారామస్వామివారే. ఇందులో స్వామివారి యోగవిద్యలు మాహాత్మ్యాలు లీలలు విపులంగా వర్ణింపబడినవి. తొలుత కేవలం సాహిత్యవిద్యావిశారదుడైన ఈ కవి స్వామివారి అనుగ్రహానికి పాత్రుడైన తరువాత "మహామంత్ర సర్వయంత్ర తాంత్రిక విధాన బ్రహ్మవిద్యాధురీణుడు"గా పరిణతి చెంది తానుకూడ అనేక మహిమలు ప్రదర్శించినాడు. రంగయామాత్యుని రామకృష్ణకవి స్వామివారి పోషణ ప్రేరణలతో దత్తావధూత శతకం, దత్తజయంతి చరిత్ర యక్షగానం, ముక్తికాంతోద్వాహం, చాముండికా విలాసం (5 ఆశ్వాసాల ప్రబంధం) మొదలైన కృతులు రచించినాడు. వఝల సుబ్బకవి స్వామివారికి ఆశ్రితుడు స్వామి ఆదేశానుసారం సీతారామకల్యాణమనే యక్షగానం రచించినాడు. సంస్కృతాంధ్రభాషా పారంగతుడు చౌడూరి శేషంభట్లనే నందవరీకి స్వామివారిపై అనేక కీర్తనలు, సంస్కృతంలో ఒక చూర్ణిక వ్రాసినాడు. స్వామివారి ప్రేరణతో ఒక అజ్ఞాతకవి "యమ్మనూరి చౌడేశ్వరి హరసహచరి" మకుటంతో వ్రాసిన 29 సీసపద్యాలు, ఇంకొక అజ్ఞాతకవి వ్రాసిన పద్యాలు శ్లోకాలు కీర్తనలు, తాళపత్రాల్లో అముద్రితంగా ఉన్నవి. ఇంకా శ్రీదత్తాత్రేయులవారి అవతారచరిత్ర పేరుతో సుదీర్ఘమైన గేయం, సీతారామస్వామి లాలిపాట, తలుపు దగ్గరి పాటలున్నవి. రంగయామాత్యుని రామకృష్ణకవి చాముండికా విలాసం కృత్యవతరణిక నుండి స్వామివారిపై ఒక పద్యం

శా॥ శ్రీరంజిల్లగ గంటి కన్నులలరం చింతావిదూరున్ నయో
దారుం ధీరు మహేశ్వరాభు పరమంత్రప్రాణభంగు న్నహ
స్రారాంతశ్చరదవ్యయానుపమసూక్ష్మాకారహంస్వరూ
పారాధ్యున్ సుగుణాలవాలు పరమాష్టైశ్వర్య సంయుక్తునిన్ (28)

చూర్ణికలో, గేయాల్లో, స్వామివారి లీలలు ధర్మకార్యాలు మహిమాతిశయాలు విస్తారంగా వర్ణింపబడినవి.

*(వచ్చే సంచికలో ముగింపు)*

# ఇంటికి ఈశాన్యం మనిషికి మరో ప్రాణం

- శ్రీ. వాసు రెడ్డి

ఈశాన్యం మూతబడుట :

ముందుగా ఈశాన్యం మూత అంటే ఏమిటో తెలుసుకుందాం. ఈశాన్యం మూత అనేక రకాలుగా ఉంటుంది. ఇంటికి తూర్పు మరియు ఉత్తర ఈశాన్యాలలో ద్వారాలు లేకపోవుట,స్థలానికి ఈశాన్యములో లెట్రిన్, బాత్రూమ్‌లు నిర్మించి కప్పు వేయుట, ఈశాన్యంలో ఇతర గదులు నిర్మించుట, ఈశాన్యం గదికి కిటికీలు, వెంటిలేటర్సు లేకపోవుట, స్థలానికి ఈశాన్యంలో ఎటువంటి నిర్మాణం జరిపినా అది ఈశాన్యం మూతే అవుతుంది. కేవలం ఈశాన్యం మూత వలన పెద్దగా దుష్ఫలితాలు లేకపోయినా ఈ విధంగా మూత ఉన్నప్పుడు ఇంటి యజమానిని లేదా పెద్ద కుమారుని బయటికి పంపించివేస్తుంది. అంటే వారు ఉద్యోగ బదిలీ లేదా విద్యా విషయిక కారణంగా గూడా ఇంటిని వదిలి దూర ప్రదేశంలో నివసిస్తుంటారు. కొన్ని నెలలకు ఒకసారి ఇంటికి వస్తుంటారు అది గూడా ఇంటికి రాక తప్పదు అన్న పరిస్థితులలో వస్తుంటారు. స్థలానికి లేదా ఇంటికి ఈశాన్యంలో ఎట్టి పరిస్థితులలోను లెట్రిన్ బాత్రూమ్‌లు నిర్మించరాదు అలాగే సెప్టిక్‌టాంక్‌లు నిర్మించరాదు. ఇంటికి ఉత్తర ఈశాన్యంలో ద్వారం లేకపోవడం ఆర్థికంగా దుష్ఫలితాలు కలుగుతాయి. అలాగే స్త్రీలకు యోగకారణం కాదు. తూర్పు ఈశాన్యంలో ద్వారం లేకపోవడం వలన పురుషులకీర్తికి గండి పడుతుంది. స్థలానికిఈశాన్యం మూతబడితే ఇంటి పరిస్థితులు వికటించి మొత్తం కుటుంబంపై అది దుష్ప్రభావాన్ని చూపుతుంది. ఇంటికి ఈశాన్యం మూతబడిన దాని కంటే స్థలానికి ఈశాన్యం మూతబడితే ఎక్కువ దుష్ఫలితాలు కలుగుతాయి.

ఈశాన్యంలో లెట్రిన్ బాత్రూమ్‌లు :

మనిషిని మరణశయ్య పై పరుండజేసి, కుటుంబాలను కలతల వెనక్కి నెట్టే తీవ్రమైన దోషం, ఈశాన్యంలో లెట్రిన్ మరియు సెప్టిక్‌టాంక్. ఈ దోష ప్రభావం ముఖ్యంగా ఇంటి యజమాని పైన, యజమానురాలి పైన మరియు ఆర్థికంగా దుష్ఫలితాలు కలుగుతాయి. ముఖ్యంగా ఇంటి యజమాని అనారోగ్యానికి గురై మందులకు నయం గాని జబ్బులతోబాధింపబడుతాడు. కొన్ని యిండ్లలో ఆ ఇంటి స్త్రీక్రమము కాని అక్రమ నీచ సంబంధాలను కలిగి ఉంటుంది. భార్యా భర్తలకు కలహాలు వస్తుంటాయి. ఆర్థికంగా చెప్పశక్యం గాని దుష్ఫలితాలు కలుగుతాయి. ఎంతరాబడి వచ్చినా ఆదాయం రానట్టుగానే ఉంటుంది. ఖర్చులు విపరీతం ; ఇల్లును, ఒళ్ళును గుల్ల చేసే దోషం ఇది. ఈ దోషం

ఇంటికి ఈశాన్యంలో ఉన్నప్పటికంటే స్థలానికి ఈశాన్యంలో ఉన్నప్పుడు ఎక్కువ దుష్ఫలితాలు కలుగుతాయి. అయితే కొన్ని సందర్భాలలో ఈశాన్యంలో ఈ దోషం ఉన్నప్పటికీ దుష్ఫలితాలు పెద్దగా కనిపించవు. అంటే ఇంటికి బలమైన ఇతర వాస్తుబలం ఉన్నప్పుడు మాత్రమే ఇది వీలవుతుంది. ఈశాన్యంలో బావి ఉండడం, పశ్చిమము ఎత్తుగా ఉండి తూర్పుపల్లంగా ఉండడం, దక్షిణం ఎత్తుగా ఉండి - ఉత్తరం పల్లంగా ఉండడం, అది వాయువ్యం బ్లాకు అయి ఉండడం ఉచ్ఛస్థానంలో అనగా తూర్పు ఈశాన్యం, ఉత్తర ఈశాన్యం, పశ్చిమ వాయువ్యం, దక్షిణ ఆగ్నేయం వంటి దిశలలో వీధి పోట్లుండడం నైరుతి ఎత్తులో ఉండడం అచట రాళ్ళలాంటి బరువులుండడం ఈ రకమైన వాస్తుబలం ఇంటికి ఉన్నప్పుడు ఇతర దోషాలు ఉన్నప్పటికీ వాటి ప్రభావం అంతగా ఉండదు.

**ఈశాన్యంలో వంట :**

మనిషిని మంట కలిపె, ఇంటి ఇల్లాలు కంట కన్నీరు పెట్టించే వాస్తు దోషం ఈశాన్యంలో వంట. మనం డబ్బులను బ్యాంకుల్లో లేదా మరో చోట ఫిక్స్‌డ్ డిపాజిట్ రూపంలో ఉంచినప్పుడు ఎక్కువ కాలం గడిచినప్పుడు ఎక్కువ వడ్డీ ఏ విధంగా వస్తుందో ఆ విధంగానే ఈశాన్యంలో వంట ఉన్నప్పుడు కాలం గడిచే కొద్దీ దాని దుష్ఫలితాల ప్రభావం అధికంగా ఉంటుంది. కొన్ని యిండ్లలో బార్యా భర్తల మధ్యసత్సంబంధాలు మంట పై పేలాల్లా పేలుతుంటాయి. ఇంటి యజమాని బుద్ధి మందగిస్తుంది. జీవితం పైన విరక్తి కలుగుతుంది. ఈశాన్యంలో వంట అంటే పొయ్యిలో కట్టెలకు బదులుగా డబ్బులు పెట్టి వంట చేస్తున్నట్టుగానే భావించాలి. మంట పై వంట మాడిపోతే ఏ విధంగా ఉంటుందో ఈశాన్యం దోషం వికటించినప్పుడుఇంటి యజమాని తను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అన్నట్టుగా ప్రతి చిన్న విషయానికి మొండిగా వాదనకు దిగుతాడు, ఎల్లప్పుడు తన్ను తాను సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఇంటికి ఈశాన్యం లోపించినప్పుడు గూడా యజమాని ఈ విధంగా ప్రవర్తిస్తాడు. పిల్లల చదువులకు ఇబ్బంది ఏర్పడడం లేదా చదువులో చురుకుదనం లోపించడం జరుగుతుంది. ఆర్థికంగా అడ్డంకులు ఏర్పడుతాయి.

## భగవద్గీత ధర్మ రక్షణకై నడువుమంటున్నది

శ్లో॥ అధచేత్త్వ మిమం ధర్మ్యం - సంగ్రామం నకరిష్యసి ।
తతస్స్వధర్మం కీర్తించ - హిత్వా పాప మవాప్స్యసి ॥

(గీత, 2-33)

- ధర్మయుతమైన ఈ యుద్ధాన్ని నీవు చేయకపోయినట్లయితే స్వధర్మాన్ని వదలినవాడవుతావు. ఉన్న కీర్తి పోతుంది; పైగా పాపం తగులుతుంది. ఈ శ్లోకం తర్వాత నీవు భయపడి యుద్ధం మానుకొన్నావని అందరూ చెప్పుకొంటారు సుమా అని అంటాడు కృష్ణ పరమాత్మ

#  ధర్మం - రాజనీతి 

- శ్రీమరింగంటి శ్రీనివాసాచార్యులు

హిందూజాతీయ జీవనంలో అడుగడుగునా "ధర్మం" అనేమాట ఏదో విధంగా మనకు వినిపిస్తూనే వుంటుంది. మరి ఈ పదానికి ప్రపంచంలోని మరేదేశ భాషల్లోనూ అనువాదపదంగానీ ప్రత్యామ్నాయ పదంగానీ లేదు. ఈ పదానికి అర్థం, నిర్వచనం వ్యాఖ్యానంతో కూడిన వివరణలు సైతం లభించవు. సాక్షాత్తు దేవ భాషయైన సంస్కృతంలో మాత్రమే ఈ పదప్రయోగం ఉంది. దీన్ని యథాతథంగా ఉపయోగించాల్సిందే తప్ప మరే ఇతర పదాన్ని ప్రత్యామ్నాయంగా వాడినా భ్రష్టవాచకమౌతుంది.

"వేదోఖిల ధర్మమూలం" అన్న ఆర్యోక్తిని బట్టి ఈ ధర్మం అన్న పదానికి అర్థం, పరమార్థం విజ్ఞాన సర్వస్వమైన వేదంలో మాత్రమే లభిస్తుంది. ఆత్మానుభవం పొందిన తపోనిష్ఠులైన మన మహర్షులు వేద విజ్ఞాన సర్వస్వాన్ని దైవ వాణిగా విన్నారు. కనుకనే వీనికి శ్రుతులని కూడా ప్రఖ్యాతి. ఈ శ్రుతుల స్మృతులనే మహనీయులు గ్రంధస్థంగావించి ప్రపంచానికి మహోపకారం చేశారు. "ధర్మానికి" విస్తృతమైన వివరణలు వ్యాఖ్యానాలు చేసిన ఈ శ్రుతి, స్మృతులే "ధర్మ"మునకు ప్రమాణములు. వేద విహితమైన కర్మలకే "ధర్మ"మని ఋషులవాక్కు.

శ్రుతులలో "ధర్మోవిశ్వస్య జగతఃప్రతిష్ఠాః" అని "ధర్మోహివీర్యం(ది) యతేహి" అనీ "ధర్మోదృతో ధారయతేహిరూపం" అనీ "ధర్మోరక్షతి రక్షితః" అనీ ధర్మం గూర్చిన ప్రాముఖ్యత ప్రకటించబడింది.

"ధర్మం" అంటే న్యాయం, సత్యం, స్వభావం అనీ ఇలా వివిధ సందర్భాలలో వివరించబడింది. ధర్మలక్షణాన్ని మరింత విస్తృతంగా ప్రకటించిన ఈ క్రింది శ్లోకం గమనించదగింది.

శ్లో॥ ధృతి క్షమా దయాస్తేయం శౌచమింద్రియనిగ్రహః ।
ధీర్ విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణం ॥

తాత్పర్యం :- ధైర్యము కలిగి యుండుట, ఓర్పు, దయ, దొంగిలించకుండా యుండుట, శుచిగా అంటే శుభ్రముగా ఉండుట, ఇంద్రియములను అదుపులో ఉంచుకొనుట, బుద్ధి వైశాల్యము, విద్యాభ్యాసము, సత్యమునే పలుకుట, కోపము తెచ్చుకొనకుండుట ధర్మలక్షణమని చెప్పబడింది.

(త్రికరణములతో అనగా శరీరముతో (చేతలతో) మనసుతో, వాక్కుతో (మాటలతో) ఎవరినీ, దేనినీ బాధించడం, హింసించడం చేయకుండుట "అహింసా పరమో ధర్మః" అని

పరమధర్మమని చెప్పబడింది.

ఇంతకీ ఈ ధర్మం దేనికి? ఎవరి కొరకు? సృష్టిలోని తిర్యక్కులు, స్థావరములు జంగమములు వీటన్నిటికి వేద విహిత కర్మలతో కూడిన ధర్మం కావాలా? విమర్శించుకునే విజ్ఞానులకు జవాబు దొరుకుతుంది.

తిర్యక్కులు, స్థావరములను వదిలేస్తే జంగమ సృష్టి నాలుగు విధములు. 1) జరాయుజములు 2) అండజములు 3) స్వేదజములు 4) ఉద్భిజములు. మావి నుండి పుట్టునవి, గృడ్డు నుండి పుట్టునవి, తేమ నుండి ముట్టునవి, భూమి పెకలించుకొని (బీజముల నుండి) పుట్టునవి. ఈ చేతనాచేతన సృష్టి మొత్తము ఒక్క మానవుడు తప్ప తన నియమిత గుణ, రస ప్రాబల్యములకు లోబడి ఉండి ప్రవర్తిస్తూ, జీవిస్తున్నవి. వేదవిహిత కర్మలతో కూడిన "ధర్మం" కేవలం మానవ జన్మకు మాత్రమే విధించబడిన దైవశాసనంగా ప్రచలితమౌతున్నది.

దైవవాణిగా మన మహర్షుల ద్వారా, జ్ఞానుల ద్వారా గ్రహించిన శబ్ద ప్రమాణమైన వేద విజ్ఞానమును విశ్వవ్యాప్తం చేసి మానవ జన్మ రహస్యాల్ని, మానవత్వ విలువన్నీ తమ జీవితాల్లో ప్రతిఫలింపజేసిన మహాత్ములు, మహనీయులుద్భవించిన పుణ్యభూమి హిందు స్థానము. "ధర్మ" పాలనలో శిఖరాగ్రము చేరి జగద్గురువులుగా విశ్వగురువులుగా ప్రసిద్ధికెక్కిన పుణ్య పురుషులుద్భవించిన పుణ్యచరిత ఈ భరతమాత. ధర్మనిరతులైన ఈ కన్నతల్లి బిడ్డలు ధర్మభ్రష్టులు కాకుండా ఉండేందుకే ధర్మగ్లాని ఏర్పడినప్పుడల్లా అవతారములెత్తి ధర్మ రక్షణ దీక్షను నెరవేర్చాడు. భ్రష్టప్రపంచ ప్రజలపై ప్రేమతోనే వార్ని ఉద్ధరించే బాధ్యత గల భారత ప్రజల "ధర్మ" రక్షణ విషయంలోనే అత్యంత శ్రద్ధ వహిస్తాడు భగవంతుడు. తరచు తన అవతార మహిమల్ని ప్రకటించేందుకు భారతావనినే ఎన్నుకుంటాడు కారణం ఇది ధర్మభూమి, కర్మభూమి, పుణ్యభూమి కనుక.

ధర్మం విశ్వజనీనమైతే మతం ఇష్టంతో కూడిన వర్గతత్వం. ధర్మాధర్మ విచక్షణ లేని ఏ మతము ధర్మబద్ధం కానేకాదు. దర్మబద్ధం కాని మతాలు స్పర్ధనూ, సృష్టి సంక్షోభాల్నీ సృష్టిస్తాయి. వీరు తమ ఉనికిని కాపాడుకోవడానికి, తమ వర్గాన్ని పెంచుకోవడానికి ప్రయత్నించే మార్గాల్నే ఎంచుకుంటాడు తప్ప "ధర్మం" వానికి ప్రాతిపదిక కానేకాదు. ఈ కోవకు చెందినవే ఇస్లాం, క్రైస్తవమతాలు.

ఎవరి నియంత్రణతో నిమిత్తం లేకుండా ప్రతి ఒక్కరు ఆచరించవలసింది "ధర్మం". దీన్ని పెంచుతూ, పోషిస్తూ, రక్షించాల్సింది రాజనీతి. ప్రజా జీవితాలు ధర్మబద్ధం కావాలి. రాజనీతి, ప్రభుత్వ చట్టాలు ధర్మయుక్తం కావాలి.

ధర్మబద్ధం కాని ప్రజా జీవితాలు దర్మనిరపేక్షమైన ప్రభుత్వాలు పగ్గాలు లేని బండి వంటివి. ధర్మము-రాజనీతి ఒక తాడులోని పురిలాగా పెనవేసికొని ఉండాలి. ఇందులో ఏ ఒక్కటి విడదీసినా బలహీనపడుతుంది. ప్రజలకు ప్రభుత్వానికి అవినాభావ సంబంధం ఉండి తీరాలి.

ధార్మికంగా, ఆర్థిక ప్రగతికీ, ఆరోగ్య మహాభాగ్యానికి పంచగవ్యముల ప్రాముఖ్యాన్ని "ధర్మం" ఘోషిస్తూ గోహత్య మహాపాపం అనీ గోరక్షగావించాల్సిందిగా ధర్మశాస్త్రం శాసిస్తుంటే, కాదు కాదు చంపి భక్షించడం మామతాచారం అని ఛాందసులంటే సెక్యులరిజం పేర. ధర్మ నిరపేక్షతతో గోహత్యను చట్టబద్ధం చేయడం రాజనీతి యొక్క ధర్మవిరుద్ధపు చర్య ఔతుంది. పాలకులు రాజనీతి ధర్మనిరపెక్షమైతే ప్రజలు ధర్మవిహీనులౌతారు. ప్రజలు, సమాజం దేశం భ్రష్టమౌతుంది. పరాధీనమౌతుంది. సుఖశాంతులు కరువౌతాయి. కనుక రాజనీతి ధర్మాన్ని కాపాడాలి. అగ్రతః చతురేవేదాః పృష్టతః సశరాశరం ॥ అన్న ఆర్యోక్తి ఈ ధర్మ సూక్ష్మాన్నే ప్రకటిస్తున్నది.

యుగయుగాలుగా "ధర్మం" వ్యక్తి నిష్ఠ నుండి సమష్టికి - సమష్టి నుండి మహేష్ఠికి - మహేష్ఠి నుండి పరమేష్ఠికి నడిపించి సుఖ, శాంతి సంతోషాలను ప్రసాదించేదే ధర్మం. అదే వేద ధర్మం - హిందూ ధర్మం.

"వేదోఽఖిల ధర్మమూలం - ధర్మమూల మిదం జగత్" ధర్మాన్ని ప్రజలు ధరించాలి. దాన్ని రక్షిస్తూ పోషిస్తూ పాలించె ప్రభుత్వం రావాలి.

"రామోవిగ్రహవాన్ ధరం:" ధర్మమే అవతారమెత్తిన శ్రీరామచంద్రుడు జన్మించిన అయోధ్య రామ జన్మభూమి రక్షణతో ప్రారంభమైన ధర్మవిప్లవం వర్ధిల్లాలిః యావద్భారత ప్రజలు రాజనీతిలో ప్రవేశించిన ధర్మ నిరపేక్షతను తొలగించి, ధర్మరక్షకులకు పట్టం కట్టాలి.

ఇందుకే ఇదే మంచి తరుణం. ★

---

# వార్తా హైందవం

'మన యోగులు' శీర్షిక క్రింద ఆచార్య బి. రామరాజు గారి వ్యాసాలు మనం వేస్తున్నాం. నలభై మంది యోగుల జీవిత చరిత్రలతో ఆ గ్రంథం వెల్వడింది. మాజీ ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు భాగ్యనగర్‌లో జరిగిన ఒక కార్యక్రమంలో 1998 జనవరి 23వ తేదీన ఆ గ్రంథాన్ని ఆవిష్కరించారు.

1998 జనవరి 8, 9 తేదీలలో మెదక్ జిల్లా రామాయంపేటలో సంభాగ్ దుర్గావాహిని శిక్షణ శిబిరం జరిగింది. ఇందులో 60 మంది మహిళలు పాల్గొన్నారు. శ్రీ కోటేశ్వరశర్మ, డా॥ ఎం.వి.ఆర్. శర్మ, డా॥ కసిరెడ్డి, సుశ్రీ చాముండేశ్వరి తదితరులు మార్గదర్శనం చేశారు.

1998 జనవరి 4వ తేదీన కరీంనగర్ జిల్లా జగిత్యాలలో కీ.శే. శ్రీ లింగం గోపాలరెడ్డి గారి సంస్మరణ సభ జరిగింది. శ్రీ కాసుగంటి సుధాకర్‌రావు, శ్రీ కోసూరి వెంకటేశ్వరరావు, శ్రీ సిద్ధారెడ్డి, డా॥ కె. వెంకటరాజరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

ఇదే తేదీన కరీంనగర్ జిల్లా మెట్‌పల్లిలో సంతాప సభ జరిగింది. శ్రీ టి. నాగయ్య, శ్రీ డి. రాజేంద్రప్రసాద్, శ్రీ భూమయ్య, శ్రీ పి. శ్రీనివాస్,. శ్రీ మూనాల రాజారాం

తదితరులు ప్రసంగించారు.

5. గుంటూరు జిల్లా చీరాలలో స్వామి వివేకానంద జయంతి ఉత్సవం (యువజన దినోత్సవం) 98 జనవరి 12న జరిగింది. శ్రీ ఎం.వి. చలపతి రావు, శ్రీ వుటుకూరి లక్ష్మణస్వామి, డా॥ ఆకొండి విశ్వనాథ శాస్త్రి. శ్రీమతి టి. అరుణ, శ్రీ సముద్రాల రంగనాథ్, శ్రీ ఎ. నాగవీరభద్రాచారి తదితరులు పాల్గొన్నారు.

6. మెదక్ జిల్లా సంగారెడ్డిలో 98 జనవరి 18వ తేదీన విశ్వ కల్యాణ్ దివస్ కార్యక్రమం జరిగింది. శ్రీ కోసూరి వెంకటేశ్వరరావు ప్రసంగించారు. శ్రీ మాణిక్‌రెడ్డి, శ్రీ ఠాకూర్ రాంసింగ్ ప్రభృతులు పాల్గొన్నారు.

7. 98 జనవరిలో జగిత్యాల నగరంలోని చిలుకవాడ మాతృమండలి ఆధ్వర్యంలో కీ.శే శ్రీ లింగం గోపాల రెడ్డి సంతాప సభ జరిగింది. అంతకు పూర్వమే జగిత్యాలలో ఏకోపాధ్యాయ పాఠశాలను విహెచ్‌పి కార్యకర్తలు ప్రారంభించారు.

8. 1998 జనవరి 4వ తేదీన కర్నూలులో దుర్గావాహిని ఆధ్వర్యంలో ఉచిత హోమియో వైద్య కేంద్రం ప్రారంభించబడింది. అంతకు పూర్వమే మెదడు వాపు వ్యాధి నిరోధక మందులు కర్నూలు పట్టణంలో పంచడం జరిగింది. శ్రీమతి సామిశెట్టి శశికళ, శ్రీమతి కె. లక్ష్మీ దేవమ్మ, డా॥ మాధురి, డా॥ నిర్మల గారల సహకారం అందింది

9. సేవాభారతి ఆధ్వర్యంలో భాగ్యనగరంలో 98 జనవరి 25వ తేదీన భారత మాత పూజోత్సవాలు రోజంతా జరిగాయి. కేశవ మెమోరియల్ విద్యాలయ ప్రాంగణంలో జరిగిన ఉత్సవాలలో 3 వేల మంది బాలబాలికలు, 2 వేల మంది పోషకులు పాల్గొన్నారు.

10. 98 జనవరి 25వ తేదీన కొత్తగూడెంలో శ్రీ రామ మహాయజ్ఞం బ్రహ్మాండంగా జరిగింది. జనవరి 12వ తేదీన భారతమాత పూజోత్సవం జరిగింది. సింగరేణి గర్ల్స్ హైస్కూల్లో పాటల పోటీల బహుమతి ప్రదానోత్సవం జరిగింది. మాతృమండలి ఆధ్వర్యంలో ముగ్గుల పోటీలు జరిగినై.

11. నెల్లూరు జిల్లాలో హిందుత్వ పరిరక్షకులకే మా ఓటు అనే నినాదంతో శ్రీ రామ మహాయజ్ఞ రథం, జనవరి 26వ తేదీ నుండి 98 ఫిబ్రవరి 12 వరకు తిరుగుతున్నది.

12. భీమవరంలో విశ్వహిందూ పరిషత్ ప్రాంత సమావేశాలు జరిగాయి. ఈ సందర్భంగా నిర్వహించిన అనేక పోటీలలో పాల్గొన్నవారికి బహుమతి ప్రదానం చేశారు.

13. భాగ్యనగర్లోని విజయ శ్రీ భవనంలో 98 జనవరి 18వ తేదీన విశ్వ కల్యాణ్ దివస్ కార్యక్రమం జరిగింది. ప్రముఖులెందరో పాల్గొన్నారు.



**విశ్వహిందు చదవండి ! చదివించండి !!**

**చందాదారులుగా చేరండి ! చేర్పించండి !!**



విశ్వహిందూ పరిషత్ పూర్వాంధ్ర ప్రాంత స్థాయి భగవద్గీత కంఠస్థ పోటీలు గుంటూరులో జరిగాయి. ఆ సందర్భంగా జరిగిన ఊరేగింపు, బహుమతి ప్రదానోత్సవ సభల చిత్రాలు. 1998 డిసెంబర్'25.



స్వామి వివేకానంద జయంతి ఉత్సవ సందర్భంగా 98 జనవరి 12వ తేదీన జరిగిన సభలో ప్రసంగిస్తున్న వారు విశ్వ హిందూ పరిషత్ కొత్తగూడెం కార్యదర్శి శ్రీ అమలాపురం సత్యనారాయణ. వేదిక మీద శ్రీ విష్ణువర్ధనరావు, శ్రీమతి నూరి లక్ష్మీ తాయారు